డాక్టర్, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

బెజవాడ వారి

# అనుపానకల్పవల్లి.

మా వైద్యశాల నిమిత్తమై స్వయముగ నిర్మింపబడిన స్వంతభవనము.



తృతీయముద్రణము 3000 ప్రతులు.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రించబడినది.

 1933. (Price 0-6-0.

# సామాన్య విషయములు.



1. బ్రాంచిస్ (శాఖలు) ఇవ్వవలయునని అనేకముంది కోరుచున్నారు. డబ్బుపుచ్చుకొనకుండగ మందులను ముందుగ మేము సప్లయి చేయము. కాని మాబ్రాంచిగ పెట్టుకొని విరివిగనమ్మువారికి వర్తక నియమములో 8 వ పేరాలో వ్రాసినదానికంటె కొంత హెచ్చు కమీషన్ మినహాయించి సప్లయిచేయుచుందుము.

2. మా కేటలాగులో నుదహరింపబడిన మందులను మాపుస్తకములను గాక యితరములు వేవని మేము సప్లయిచేయము.

3. రోగులు తమయొక్క రోగలక్షణములను వివరముగ వ్రాసి పంపినచో ఏమందుపుచ్చుకొనదగినదియు మొదలగు సంగతులు వివరముగవ్రాసి పంపగలము. ఇచ్చటకు స్వయముగ వచ్చినను అన్ని సంగతులు చెప్పగలము.

4. మేము చేసినమందులన్నియు మాచే ప్రకటింపబడిన ఆయుర్వేదౌషధరత్నాకరము, ఆంధ్రభైషజ్యరత్నావళి, భస్మప్రకాశిక, చరకము, ఈగ్రంథముల ననుసరించియే తిరుచుచేయబడును.

5. అన్నిమందులను మేము దగ్గరవుండి స్వయముగ తయారు చేయించెదము.

6. మామందులయందు ఏవిధమగుదోషమున్నదని తోచినను వెంటనే మాకు తెలుపుడు. అటులు చేసినచో తప్పుయున్న యెడల సర్దుకొనుటగాని లేనియెడల దానికితగిన సంజాయిషీ వ్రాయుటగాని చేయగలము. తెలిసికూడ వ్రాయనియెడల లోకమును మోసగించినవారగుదురు.

7. రోగులు వ్రాసినజాబులన్నియు రహస్యముగనుంచబడును.

8. రోగినిచూచుటకు మమ్ములనుఇంటికిరమ్మనికోరెయెడల బెజవాడయందైనచో రు1-0-0 ను; పొరుగూరుఅయినచో 2-3 గంటలకు తిరిగివచ్చేయెడల రు5-0-0 లును, ఒకపూట అయ్యెయెడల రు 10-0-0 లును, ఒకరోజుఅయ్యేయెడల రు20-0-0 లును ఫీజతీసుకొందుము. ప్రయాణఖర్చులను తీసుకవెళ్ళేవారే భరింపవలయును. పనులతొందరచే పొరుగూరు ప్రయాణమొక్కొకప్పుడు మానవలసి వచ్చుచుండును.

# స్వవిషయము.

మేమిదివరలో అనేకవిధములగు స్వవిషయములను వ్రాసియుంటిమి. నిష్క-ల్మషముగ పనిచేయుటయే ప్రధానముగాని అట్టివి విశేషించి వ్రాయుట అనవసరమనియే మా అభిప్రాయము. సంపాదింపబూనిచో అనేకవిధములగు బంగారు పతకములు మొదలగువానిని సంపాదించియుందుము. మాకుగల అవకాశము ఎవరికి లేదనియే మానమ్మిక. కాని అట్టివి సంపాదించు ప్రయత్నములు చేయుటయం గాని, అయాచితముగ వచ్చినవానినైనను ప్రకటించుటనుగాని మామనస్సు ఏమాత్రమును అంగీకరింపదు. అవకాశమున్నంతవరకు వైద్యసేవచేయుటయే ముఖ్యమని మాముఖ్యాభిప్రాయము. మేము వ్రాసినగ్రంథములే ఇందు కుదాహరణముగనుండగలవు. తుదకు మాకెట్లాగునందైనను అనవసరమగు విషయములను వ్రాయక అందరికిని ఉపయోగకరమగు ఏకొద్దివిషయమునో వ్రాయుచువచ్చితిమి. మేము దగ్గరవుండి ప్రతిమందును స్వయముగ తయారుచేయించెదము. అట్లు కానిచో మందులు సరిగ తయారుకావనియే మానమ్మిక. అందుచేతనే మేము అనేకపదవులను వదలుకొని, తుదకు వైద్యమునుకూడ మానుకొని, మందులను చేయించుటమాత్రమే ప్రధానవిషయముగా పెట్టుకొంటిమి. మామందులను అనేకమంది వాడుచు మాకు అమితమగు ప్రోత్సాహమును కలిగించుచున్నారు. అందుచే మావైద్యశాల ఆంధ్రదేశమందలి ప్రధాన వైద్యశాలలలో నొకటిగనున్నది. రాజవ్యాధులచే పీడింపబడుచున్న అనేకమంది దుర్భరరోగులు దూరదేశములనుండికూడ మావద్దకువచ్చి చికిత్సను పొందుచున్నారు. అట్లు రాజాలక యున్నవారలు విషయములను పోస్టుద్వారా తెలిపి చికిత్సను పొందుచున్నారు.

మేము మలబారు, పంజాబు మొదలగు అనేక దూరదేశములనుండి మూలికలు మొదలగు వానిని తెప్పించి అనేకవిధములగు పరిశోధనలు చేయుచూ మందులను తయారుచేయించుచున్నాము. తాలూకాబోర్డు మొదలగు సంస్థలకు మేము మందులను సప్లయిచేయుచున్నాము. ఆంధ్రులింకను మాకు ప్రోత్సాహమును కలిగించినచో దానికి తగినట్లు పనిచేయుటకు మేము సంసిద్ధులుగ నున్నాము. వైద్యసేవనిమిత్తమై మాకిదివరలో కలుగజేసిన అవకాశమునకై శ్రీమద్దివ్య తరికిని ఆంధ్రసోదరులకును అనేక వందనశతంబు లర్పించుచున్నారము.

ఇట్లు
వైద్యశాలాధికారి,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

ది 15—5—1933,
బెజవాడ.

# బాలసుధ (రిజష్టర్డు.)

మా బాలసుధ అనేక సంవత్సరములనుండి అనేకమంది గొప్పవారిచే అనేక యోగ్యతాపత్రములను పొందుచున్నది. పసిపిల్లలకు గలుగు సమస్తవ్యాధులకును అమోఘముగా పనిచేయుచున్నది. దీనిని మొదటినుండియుకూడ మేము వ్రాసినవిధమున వాడినచో పసిపిల్లలకు ఏవిధమగు వ్యాధులును కలుగనేరవు. తల్లిపాలనుగాక యితర ఆహారములను వాడు పసిపిల్లలకు దీనిని తప్పక వాడవలసి యుండును. అజీర్ణము, జలుబు, పడిశెము, అజీర్ణవిరేచనములు, కడుపుబ్బరము, మలబంధము మొదలగు వ్యాధులను దరికిచేరకుండ చేసి పుష్టివంతులుగను ఆరోగ్యవంతులుగను నుండునట్లు చేయును. అనేకవిధములగు దీర్ఘవ్యాధులుకూడ దీనివలన చిత్రముగ నశించుచున్నవి. స్త్రీలుకూడ దీనిని స్వయముగ వాడుకొనవచ్చును. చక్కని వస్తువులతో తయారుచేయబడినదగుటచే ఏవిధమగు వికృతిని కలిగింపక చక్కగ పనిచేయును. మోతాదు, అనుపానము, పథ్యము వగైరాలన్నియు అతి వివరముగ తెలుపు కాగితము మందు సీసాతోకూడ పంపబడును.

మాత్రలు 50 కల సీసా 1కి రు 1-0-0.

---

ఆర్యా! వందనములు. ఇప్పటికి మీ బాలసుధ 4 సీసాలు నేను తెప్పించియుంటిని. రెండు సీసాలు మా పిల్లకే వాడితిని. వాటిగుణము అమోఘము. చంటిపిల్లల పాలిటి వరప్రసాదియగు ఈ బాలసుధను కనిపెట్టిన తమకు భగవంతుడు తోడ్పడుచుండుగాక. దయచేసి 3 బాలసుధసీసాలు వి. పి. పోష్టుద్వారా పంపించ ప్రార్థన.

మర్ల వెంకట్రావు, హెడ్మాష్టరు,
తాళ్ళబురిడి, విశాఖపట్నం జిల్లా.

8—3—31.

---

అయ్యా! అజీర్ణమునకు అజీర్ణవిరేచనములకు మా పిల్లవానికి నేను ఈయని యింగ్లీషుమందు లేదు. పనిచేసినమందు ఏదియు లేదు. మీ బాలసుధ అమోఘముగా పనిచేసినది. మరల 2 సీసాలు పంపించ కోరుతాను.

వి. జగన్నాథరావు, బి. ఏ., లాండులార్డు,
పెదమద్దాలి, కృష్ణాజిల్లా.

1-9-31

---

అయ్యా! తమవద్దనుండి రప్పించినబాలసుధ వాడిచూడగా అమోఘముగా పనిచేసినందుకు నేను ఆశ్చర్యమును పొందితిని.

మాదిం అప్పలస్వామి,
నేటివ్ డాక్టరు, కాండాగ్లే, రంగూన్.

21—10—32

---

అయ్యా తమరు పంపిన బాలసుధ చాలా బాగుగా పనిచేసినది.

సి. హెచ్. వెంకటసుబ్బారావు,
లోకల్ ఫండు ఆయుర్వేదిక్ డిస్పెన్సరీ డాక్టరు,
నక్రికల్, గుంటూరుజిల్లా.

10—12—32

---

అయ్యా! బాలసుధ సీసా ఒకటి అర్జంటుగా పంపవలయును. ఇదివరకు తాము పంపిన సీసా చాల బాగుగా పనిచేసినందున మరల వ్రాసినాను.

షేకు మస్తాన్ సాహెబు,

14—11—32 సిద్ధవరం, నెల్లూరు జిల్లా.

---

అయ్యా! తమ బాలసుధ అమోఘముగా పని చేయుచున్నదని వినియుంటిని.

పి. రామకోటేశ్వరరావు, లోకల్ ఫండు ఆయుర్వేదిక్ డిస్పెన్సరీ డాక్టరు,

30—11—32 రేమిడిచెర్ల, గుంటూరుజిల్లా.

---

అయ్యా! మీ ఆంధ్రభైషజ్యరత్నావళిని భస్మప్రకాశికను చూచితిని. చాల సంతృప్తిని సంతోషమును కలిగించినవి.

మద్దిరాల నాగరాజు,

10—11—31. తామరాడ, తూర్పుగోదావరి జిల్లా.

---

ఘనతజెందిన అయ్యా! తమ భస్మప్రకాశిక, ఆయుర్వేదౌషధ రత్నాకరము మొదలగు గ్రంధములన్ని తెప్పించి చూచినాను. చాలా బాగున్నవి.

సి. వి. లింగారెడ్డి తాలూకాబోర్డు అండ్ డిస్ట్రిక్టుబోర్డు మెంబరు,

30-9-31 రెడ్డివారిజంబులదిన్నె, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! తాము పంపిన ఔషధములు (చంద్రోదయం వగైరాలు) అంది వాటిని వినియోగించుచుంటిని. చక్కగ పనిచేయుచున్నవి.

కె. వీరభద్రరావు, ఆయుర్వేదిక్ డాక్టరు,

16-12-31 మెంటాడ, విశాఖపట్నం జిల్లా.

---

అయ్యా! నేను చ్యవనప్రాశలేహ్యం వగైరాలకు ఆర్డరుయిచ్చి బెజవాడ మీవద్దకు పంపినాను. వారు మీవద్దనుండి కొనితెచ్చి వాడినారు. చాలా బాగుగా గుణమిచ్చినవి.

అయిలూరి సిద్దయ్య, ఆయుర్వేదవైద్యులు,

24—9—31 అత్తిలి, ప॥ గోదావరిజిల్లా.

---

అయ్యా! మీరు యిదివరలో పంపిన పుస్తకం చూచి చాలా సంతోషించితిని.

శె. విజయసారధి, నేటివ్ డాక్టరు,

6-11-31 బూరుగుపల్లి, ప॥ గోదావరిజిల్లా.

---

అయ్యా! తమవద్ద యిదివరలో కొన్ని మందులు తెప్పించి వాడుక చేసితిని. అవి బాగుగా పనిచేసినవి.

పె. శ్రీరాములు,

బోర్డుస్కూలు హెడ్మాష్టరు అండ్ పోస్టుమాష్టరు,

28-9-31 బయ్యనగూడెం, ప॥ గోదావరిజిల్లా.

అయ్యా! తమనుండి ఆంధ్రభైషజ్యరత్నావళిని తెప్పించి చూడగా చాలా సంతోషం అయినది.
సిలి వీరభద్రయ్య,
8-11-31 యాడికి, అనంతపురంజిల్లా.

---

అయ్యా! తమయొక్క ఖ్యాతిని ఔషధముల గుణములవల్లను నా స్నేహితులవలన తెలిసికొంటిని.
యస్. శ్రీరాములు,
4-9-31 రంపావీధి, బరంపురం, గంజాంజిల్లా.

---

అయ్యా! మీరుపంపిన ఆయుర్వేదౌషధరత్నాకరం చేరినది. గ్రంథము, విమర్శగా వ్రాసినందుకు చాలా సంతసించితిమి.
టి. సూర్యనారాయణయ్య,
11—6—32 ఆయుర్వేదిక్ డాక్టరు, కడప.

---

అయ్యా! మీరుపంపినపుస్తకములు చేరినవి. చాలబాగావున్నవి.
కె. వి. నరసింహం,
6—6—32 నంద్యాల, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! ఇదివరలో భస్మప్రకాశిక నేను తెప్పించుకొని వుంటిని. తమ అనుగ్రహమువల్ల అనేకయోగములు లభించినవి.
కొకర్ల వీరభద్రయ్య,
8—10—32 కొణిదేడు, గుంటూరుజిల్లా

---

అయ్యా! తమపుస్తకములన్నియు చదువగా మనస్సుకుచాల సంతోషమయినది.
టి. అహోబలశాస్త్రి,
20—9—32 నంద్యాల, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! తమరు అంపినమందులు బాగావర్కుచేస్తూయున్నవి.
సైలాడ మారయ్య,
1—10—32 అయ్యన్నపేట, విశాఖపట్నం జిల్లా.

---

అయ్యా! డి. వాసుదేవంగారిక్కి తమరు సిద్ధమకరధ్వజమున్నూ సిద్ధామృతమున్నూ పంపియున్నారు. అది చాలా గుణముచేసినట్లు నిన్నటిరోజున వారు నాతో చెప్పియున్నారు.
అయల సోమయాజుల శ్రీరాములుగారు,
25—12—32 పార్వతీపురం, విశాఖపట్నం జిల్లా.

---

అయ్యా! మీరు పంపించిన భైషజ్యరత్నావళి చూడగ నిండాసంతోషమైనది.
నేటివ్ డాక్టరు, చిలకపాటి కందాళి కృష్ణమాచార్యులస్వామి,
30—1—33 పిడూరుపాలెం, నెల్లూరు జిల్లా.

---

అయ్యా! నాకు మీరుయిచ్చివున్న ఆయుర్వేదౌషధరత్నాకరమున్నూ, భస్మప్రకాశికయున్నూ చూచి చాలా సంతోషించినాము.
బి. అప్పయ్యాచార్లు,
17—1—33 పల్లురాళ్ళపల్లె, కడప జిల్లా.

---

# ఔషధానుక్రమణిక.

## రసౌషధములు.

(వంటకజ్జలి ఔషధములు)

| పే.నెం.వ.నెం. | పేరు | పరిమాణం | రు. |
|---|---|---|---|
| 41-158 | శ్లేష్మచింతామణి | ,, | 8 |
| 56-248 | శ్లేష్మవిధ్వంసి | , | 3 |
| 42-167 | శ్వాసకాశేశ్వరము | ,, | 2½ |
| 41-156 | శ్వాసకుఠారము | ,, | 2 |
| 13- 35 | షడ్గుణము | ,, | 4 |
| 16-45 | సన్నిపాతభైరవి | ,, | 1½ |
| 1- 1 | సిద్ధమకరధ్వజము | ,, | 40 |
| 14-38 | సింహప్రతిపాలనము | 10 మా | 1 |
| 5 - 6 | సువర్ణ కాంతవల్లభరసము | 1తు | 6 |
| 9 - 21 | సువర్ణక్రవ్యాది | ,, | 4 |
| 11- 28 | సువర్ణభూపతి | ,, | 10 |
| 10- 24 | సువర్ణమాల్యవసంతము | ,, | 10 |
| 55-247 | సువర్ణమేహవంగరాజీయము | | 12 |
| 6- 8 | సువర్ణపారరాక్షసం | ,, | 8 |
| 7-14 | సువర్ణసూర్యావర్తి | ,, | 6 |
| 40-153 | సూతికాభరణము | ,, | 20 |
| 15- 42 | స్వచ్ఛన్నము | ,, | 1 |
| 13- 34 | స్వర్ణవంగము | ,, | 2 |
| 15- 40 | హుతాశనము | ,, | 1 |
| 43-172 | క్షయకులాంతకము | ,, | 6 |

## భస్మములు

| పే.నెం.వ.నెం. | పేరు | పరిమాణం | రు. |
|---|---|---|---|
| 17- 47 | అభ్రకభస్మ | 1తు | 4 |
| 44-175 | అయస్కాంతభస్మ | ,, | 4 |
| 45-184 | ఇంగిలీక సిందూరము | ,, | 1 |
| 55-239 | కంచుభస్మ | ,, | 3 |
| 21- 59 | కర్పూరశిలాజతుభస్మ | ,, | 3/8 |
| 18- 49 | కాంతిలోహభస్మ | ,, | 3 |
| 44-176 | కాంతాభ్రకసిందూరము | ,, | 4 |
| 21- 62 | కాసీససిందూరము | ,, | ½ |
| 17- 48 | ఖడ్గలోహభస్మ | ,, | 4 |
| 22- 66 | గంధకభస్మ | ,, | 1 |
| 21- 63 | గవ్వలభస్మ | ,, | 3/8 |
| 20- 55 | తామ్రభస్మ | ,, | 4 |
| 45-180 | తారమాక్షికభస్మ | ,, | 1 |
| ,,-183 | తాళకసిందూరము | ,, | 2 |
| 44-177 | త్రివంగభస్మ | ,, | 3 |
| 21- 60 | పగడపుమారభస్మ | ,, | ½ |
| 45-179 | పగడభస్మ | ,, | 2 |
| 18- 50 | మండూరభస్మ | ,, | 2 |
| 45-182 | ముత్యపుమారభస్మ | ,, | 20 |
| 19- 54 | ముత్యభస్మ | ,, | 40 |
| ,,- 53 | రజతభస్మ | ,, | 5 |
| 22- 65 | రసభస్మ | ,, | 4 |
| 46-185 | రాతినారభస్మ | ,, | 3/8 |
| 18- 51 | లోహాభ్రకసిందూరము | ,, | [illegible] |
| 20- 57 | వంగభస్మ | ,, | 2 |
| ,,- 58 | వైక్రాంతభస్మ | ,, | 2 |
| 21- 61 | శంఖభస్మ | ,, | 3/8 |
| 45-181 | శుక్తిభస్మ | ,, | 3/8 |
| 55-244 | శృంగిభస్మ | ,, | ½ |
| 45-178 | సత్తుభస్మ | ,, | 1½ |
| 20- 56 | సీసభస్మ | ,, | 4 |
| 19- 52 | సువర్ణభస్మ | ,, | 45 |
| 46-186 | సూరేకారంభస్మ | ,, | 3/8 |
| ,,-187 | స్ఫటికభస్మ | ,, | 3/8 |
| 22- 64 | హేమమాక్షికభస్మ | ,, | 1½ |

## చూర్ణములు

| పే.నెం.వ.నెం. | పేరు | పరిమాణం | రు. |
|---|---|---|---|
| 47-193 | అగ్నిముఖచూర్ణము | 1పా | 3 |
| 24-74 | అశ్వగంధాదిచూర్ణము | ,, | 4 |
| 25- 84 | అవిపత్తికరచూర్ణము | ,, | 4 |
| ,,- 81 | ఆకారకరభాది చూర్ణము | ,, | 4 |
| ,,- 79 | ఏలాదిచూర్ణము | ,, | 5 |
| ,,- 80 | గంగాధరచూర్ణము | ,, | 4 |
| 47-192 | గోక్షురాదిచూర్ణము | ,, | 3 |

| పే.నెం.వ.నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 24- 77 | చందనాదిచూర్ణము | ,, | 4 |
| 46-190 | చాతుర్జాతచూర్ణము | ,, | 5 |
| 24- 78 | జాతీఫలాదిచూర్ణము | ,, | 3 |
| 22- 67 | తాళీసాదిచూర్ణము | ,, | 6 |
| 46-189 | త్రికటుచూర్ణము | ,, | 4 |
| ,,-188 | త్రిజాతచూర్ణము | ,, | 6 |
| 24- 75 | త్రిఫలాచూర్ణము | ,, | 2 |
| 23- 71 | త్రివృత్ చూర్ణము | ,, | 4 |
| ,,- 72 | దాడిమాష్టకచూర్ణము | ,, | 4 |
| 25- 83 | ఫిరంగాదిచూర్ణము | ,, | 4 |
| 24- 76 | పుష్యానుగచూర్ణము | ,, | 5 |
| 23- 69 | భాస్కరలవణచూర్ణము | ,, | 4 |
| 25- 82 | మహాద్రాక్షాదిచూర్ణము | ,, | 6 |
| 55-240 | సారస్వతచూర్ణము | ,, | 5 |
| 22- 68 | సితోపలాదిచూర్ణము | ,, | 6 |
| 24- 73 | సుదర్శనచూర్ణము | ,, | 3 |
| 46-191 | స్థాలీచూర్ణము | ,, | 4 |
| 47-194 | స్ఫటికాదిచూర్ణము | ,, | 3 |
| 23- 70 | హింగ్వష్టకచూర్ణము | ,, | 4 |

## మాత్రలు.

| పే.నెం.వ.నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 27- 91 | అగ్నితుండివటి | 50 మా | $\frac{3}{4}$ |
| 56-245 | అహిఫేనాదివటి | ,, | 1 |
| 26- 86 | అశోకవటి | ,, | $1\frac{1}{2}$ |
| 48-199 | ఇచ్ఛాభేది | ,, | $\frac{3}{4}$ |
| 51-221 | కర్పూరాదివటి | ,, | 1 |
| 28- 95 | కస్తూరిమాత్రలు | 100 మా. | 1 |
| 47-197 | కైశోరగుగ్గులు | 50 మా. | $\frac{3}{4}$ |
| ,,-196 | గోక్షురాదిగుగ్గులు | ,, | 1 |
| 29- 96 | చందనాదివటి | ,, | 1 |
| 28- 93 | చంద్రప్రభావటి | ,, | $1\frac{1}{4}$ |
| 29- 97 | చిత్రకాదిమాత్రలు | ,, | $\frac{3}{4}$ |
| 47-195 | తాంబూలవటి | ,, | $\frac{3}{4}$ |
| ,,-198 | త్రిఫలాగుగ్గులు | ,, | $\frac{3}{4}$ |
| 26- 88 | మహాయోగరాజగుగ్గులు | ,, | 2 |
| 26- 87 | యోగరాజగుగ్గులు | ,, | $\frac{3}{4}$ |
| 29- 98 | రజతసవనీతమాత్రలు | 25 మా. | 1 |
| 27- 92 | విషూచివటి | 50 మా. | 1 |
| 26- 85 | వీర్యస్తంభనవటి | ,, | 1 |
| 48-200 | శంఖవటి | ,, | $\frac{3}{4}$ |
| 27- 90 | సంజీవనివటి | ,, | $\frac{3}{4}$ |
| 26- 89 | సుఖవిరేచనవటి | ,, | $\frac{1}{2}$ |
| 28- 94 | సూతికామాత్రలు | 5 మా, | 1 |

## ఆసవారిష్టములు

| పే.నెం.వ.నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 32-114 | అభయారిష్టము | 1 పా | $1\frac{1}{4}$ |
| 29-100 | అశోకారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| 30-105 | అమృతారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| 31-109 | అహిఫేనాసవము | ,, | 8 |
| ,,-111 | అర్జునారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| ,,-108 | అశ్వగంధారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| 49-208 | ఉశీరాసవము | ,, | $1\frac{1}{4}$ |
| 31-112 | కనకాసవము | ,, | $1\frac{1}{4}$ |
| ,,-110 | కర్పూరాసవము | ,, | 6 |
| 48-201 | కిరాతారిష్టము | ,, | $1\frac{1}{4}$ |
| 31-106 | కుటజారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| 49-205 | కుమార్యాసవము | ,, | $1\frac{1}{4}$ |
| ,,-209 | ఖదిరారిష్టము | ,, | $1\frac{1}{4}$ |
| 30-101 | చందనాసవము | ,, | $1\frac{1}{4}$ |
| 48-202 | జీరకాద్యరిష్టము | ,, | 3 |
| 49-206 | తక్రారిష్టము | ,, | $1\frac{1}{4}$ |
| ,,-207 | దశమూలారిష్టము | ,, | 3 |
| 29- 99 | ద్రాక్షారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| 48-203 | పునర్నవారిష్టము | ,, | $1\frac{1}{4}$ |
| 32-115 | బలారిష్టము | ,, | $1\frac{1}{4}$ |
| 31-107 | బబ్బూలారిష్టము | ,, | $1\frac{1}{4}$ |
| 48-204 | భృంగరాజాసవము | ,, | $1\frac{1}{4}$ |
| 55-241 | రోహితకారిష్టము | ,, | $1\frac{1}{2}$ |
| 30-104 | లోహాసవము | ,, | $1\frac{1}{2}$ |

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, బెజవాడ.

| పే. నెం.వ నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 39-103 | వాసారిష్టము | ,, | 1¼ |
| ,,-102 | సారస్వతారిష్టము | ,, | 2½ |
| 32-113 | సారిబాద్యాసవము | ,, | 1½ |

### ఘృతములు.

| పే. నెం.వ నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 32-118 | అశోకఘృతము | 4 జా | 1½ |
| 49-210 | అర్జునఘృతము | ,, | 1¼ |
| ,,-211 | అశ్వగంధఘృతము | ,, | 1½ |
| 33-120 | కల్యాణఘృతము | ,, | 1¼ |
| 56-246 | త్రిఫలాఘృతము | ,, | 1¼ |
| 33-119 | పంచగవ్యఘృతము | ,, | 1¼ |
| 32-117 | పంచతిక్తగుగ్గులుఘృతము | ,, | 1¼ |
| ,,-116 | బ్రాహ్మి(సారస్వత)ఘృతము | | 1½ |

### తైలములు.

| పే. నెం.వ నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 34-128 | అమృతామలకతైలము | 4జా | ¾ |
| 33-121 | అర్కక్షీరతైలము | ,, | ¾ |
| 50-212 | కేతక్కితైలము | ,, | 1 |
| 33-122 | చందనాదితైలము | ,, | 1½ |
| 50-214 | భాగమాషతైలము | ,, | 1¼ |
| 33-123 | నారాయణతైలము | ,, | 1¼ |
| 50-216 | నిర్గుండ్యాదితైలము | ,, | 1 |
| 34-125 | పిండతైలము | ,, | 1 |
| ,,-129 | బలాతైలము | ,, | 1 |
| 50-215 | భృంగరాజతైలము | ,, | 1 |
| 34-126 | భృంగామలకతైలము | ,, | ¾ |
| ,,-124 | మాషతైలము | ,, | 1 |
| 35-130 | రాస్నాదితైలము | ,, | ¾ |
| 34-127 | విషముష్టితైలము | ,, | 1 |
| 50-213 | హింగుత్రిగుణతైలము | ,, | 1 |

### లేహములు.

| పే. నెం.వ నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 36-135 | అశ్వగంధాదిలేహము | 1పా | 3 |
| 35-133 | ఆమలకలేహము | ,, | 2 |
| 36-136 | కూష్మాండలేహము | ,, | 2 |
| ,,-139 | చ్యవనప్రాశలేహము | ,, | 3 |
| 35-131 | త్రివృల్లేహము | ,, | 2 |
| 50-217 | నారసింహ (శతమూలికాది) లేహము | ,, | 5 |
| 35-132 | పాలసుగంధిలేహము | ,, | 2 |
| 36-138 | శీరంగాదిలేహము | ,, | 3 |
| 35-134 | మదనకామేశ్వరిలేహము | ,, | [illegible] |
| 55-242 | మహాభల్లాతకలేహము | ,, | 3 |
| 36-137 | వాసావలేహము | ,, | 2 |

### ఇతరౌషధములు.

| పే. నెం.వ నెం. | పేరు | పరిమాణం | రు |
|---|---|---|---|
| 38-148 | అజమోదార్కము | 24జా | ½ |
| 52-226 | అమృతభల్లాతకి | 1 శే | 2 |
| 37-143 | కర్ణామృతము | 1 జా | ¼ |
| 38-145 | గంధకరసాయనము | 20మా — | ¾ |
| 37-140 | గంధకపుష్పము | 1తు | ½ |
| 52-224 | గోమూత్రశిలాజతు | ,, | [illegible] |
| 51-219 | జంబీరాది పానకము | 4 జా | ¾ |
| 56-243 | తామరతైలము | సీ 1కి | ¾ |
| 39-150 | తాలకాదివర్తి | 12 కని | ¾ |
| 38-149 | తామ్రమైనము | 1తు | ¾ |
| ,,-147 | తిప్పసత్తు | ,, | ⅜ |
| 52-225 | నారికేళాంజనము | 1 సీసా | ½ |
| 37-144 | నేత్రబిందు | 1జా | ¼ |
| 51-218 | పంచతిక్తపానకము | 4జా | ¾ |
| 51-222 | పంచవక్త్రరసం | 50 మా | ¾ |
| 39-151 | బాలసుధ | 50 మా | 1 |
| 37-141 | భావనకరక్కాయ | 1 శే | 1 |
| 52-227 | భావనజీలకఱ్ఱ | 1 శే | 1½ |
| ,,-228 | భావనశుంఠి | 1 శే | 1¼ |
| ,,-229 | భాండవము | 1తు | [illegible] |
| 37-142 | మాదీఫలరసాయనము | 4జా | ¾ |
| 51-223 | మాణిక్యరసము | 1తు | 1½ |
| 53-231 | మధూచ్ఛిష్టాదిలేపము | 1డబ్బా | ½ |
| ,,-230 | యవాన్యర్కము | 24 జా | ¾ |
| 38-146 | రసోత్తమాదిలేపము | 1పా | 6 |
| 51-220 | శంఖద్రావకము | 1జా | 1 |

ఓమ్

శ్రీరస్తు.

ఆరోగ్యమస్తు.

# శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, బెజవాడ వారి

# సుప్రసిద్ధౌషధముల ప్రకటనము.

## రసౌషధములు.

### —* 1 సిద్ధమకరధ్వజము. *—

సిద్ధమకరధ్వజమనెడి పేరును వినినతోడనే దీనియొక్క ప్రభావము అందరికిని ప్రత్యక్షగోచరమగుచునే యుండును. అందుచే దీని గూర్చి మేము విశేషించి వ్రాయదలచుకొనలేదు. ఇందు బంగారమధికముగ కలయును. కావున క్షయ, దగ్గు, ఆయాసము, అతిమూత్రము, మధుమేహము, శుక్లనష్టము, నపుంసకత్వము మొదలగు వ్యాధులను నిశ్చయముగ నశింపచేయును. మరియు పక్షవాతము, జీర్ణించిన సవాయివ్యాధులు, జీర్ణించిన సెగవ్యాధులు, బలహీనత, వాతవ్యాధులు, ఉన్మాదము, అజీర్ణము, శుష్కించుట మొదలగు వ్యాధులను నశింపజేయును. రక్తశుద్ధి చేయును. శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును కలిగించును. ఇంతయేల! సమస్తవ్యాధులను నశింపజేయుననుటలో నెంతమాత్రము సందేహము లేదు. ఇసుకవలె రజనుగనుండు దానియందు బంగారము కలసియుండుటకు ఎంతమాత్రము అవకాశము లేదు. కాన మేము కుప్పెలో అడుగనుండు బంగారమును సిందూరమును కలిపి నూరి పంపెదము. అందుచే మోఘముగా పనిచేయును. మేము శాస్త్రప్రకారముగ జాగరూకతతో వండుటచే వేడిచేయుట మొదలగు దుర్లక్షణముల నెంతమాత్రము కలిగింపక బహుచక్కగ పనిచేయును.

దీని ¼ తులము, 35 మొదలు 45 పొట్లములవరకు కట్టి ఉదయ మొకపొట్లము, సాయంకాల మొకపొట్లము, తేనెతో గాని, నేతితో గాని, పంచదారతో గాని, సేవింపవలయును. లేక ¼ తులమును కలుబందరసముతో గాని పన్నీరుతో గాని 1, 2 రోజులు బాగుగ మర్దించి 35, 45 మాత్రలు చేసి ఉదయము, సాయంకాలము ఒక్కొక మాత్ర చొప్పున సేవింపవలయును. దీనిని రసౌషధముగ సేవించునెడల నీమాత్రను భోజనమైన వెంటనే తాంబూలముతో సేవింపవలయును. కొందరు చంద్రోదయమునకు గాని ఇతరములకు గాని, చెప్పబడిన అనుపానములను చేర్చివాడెదరు. మేము కేవలమందునే పైవిధముగ వాడెదము. ఇది నాడికి పుష్టిని కలిగించును. రక్తవృద్ధిని రక్తశుద్ధిని చేసి నరములకు బలమును కలిగించుటలో ప్రశస్తమయినదగుటచే శుక్రదోషములను ఆర్తవ దోషములను పోగొట్టి సంతానములేనివారికి కూడ సత్సంతానమును కలిగించును. సవాయిగాని సెగగాని జీర్ణించుటచే కలిగిన బుఱుకూల, గర్భస్రావములు, నేత్ర

ములు ఎఱ్ఱగనుండుట, శరీరము వెచ్చగనుండుట, చేతులునల్లగనుండుట, గర్భములు తరుచు పోవుట, పుట్టినపిల్లలు తరుచు మృతినొందుచుండుట, మొదలగునవి నిస్సందేహముగా నశించును. దీనిని సేవించుట మానినపిదపగూడ చక్కని గుణములను కొంతకాలమువరకు కలిగించుచునేయుండును. దీనియొక్క ప్రభావమునుబట్టి ఈయొక్క మందునుగూర్చియే మేమొక ప్రత్యేక కేట్లాగును వ్రాసియున్నాము. కావలసినవారు దానిని చూచినయెడల యిది సమస్తవ్యాధులను ఎట్లునశింపచేయునదియు తెలియగలదు. తు 1 కి రు 40-0-0.

## —* 2 మకరధ్వజము. *—

అరురెట్లు గంధకము చేర్చబడి మూడుసార్లు వంటవండబడినది. అందుచేబహు ఆశ్చర్యముగ పనిచేయును. అట్లు వండబడుటచే షడ్గుణబలిజారితమకరధ్వజమనికూడ చెప్పబడును. సిద్ధమకరధ్వజమని చెప్పబడినగుణములయందు అమోఘముగపనిచేయును. బంగారముకలిపి నూరబడియే పంపబడును. మోతాదు అనుపానము మొదలగువానిని సిద్ధమకరధ్వజము చెప్పబడినవిధముననే పరికల్పించుకొనవలయును. ఆరురెట్లు గంధకముతో చాలవంటలు చేయబడుటచే జీర్ణించినసవాయివ్యాధులు, చర్మవ్యాధులు, రక్తవ్యాధులు, ఉడుకువ్యాధులు మొదలగు వ్యాధులయందు చక్కని గుణముల నిచ్చును. రక్తవృద్ధిని చేయును. ఆకలిని పుట్టించును. నిస్త్రాణ (బలహీనత)ను వెంటనే తగ్గించును. నరములకు పుష్టిని కలిగించును. మందుసేవించుచున్నపుడుకంటె మానిన పిదపకూడ చక్కని గుణములను కలిగించుచుండును. జ్వరము మొదలగు సమస్తవ్యాధులనుగూడ కొందరు యీమకరధ్వజనే వాడెదరు. తు 1 కి రు 20-0-0.

## —* 3 పూర్ణచంద్రోదయము *—

దీనిని సేవించువారు వేరుగ పచ్చకర్పూరము, కస్తూరి, మొదలగువస్తువులు జేర్చుకొనవసరములేకుండగ మేమే జేర్చిపంపెదము. ఈవస్తువులు శాస్త్రప్రకారముగను, అనుభవపూర్వకముగను, జేర్చబడియుండుటచే "పూర్ణచంద్రోదయము వేడిచేసినది. మందముజేసినది" మొదలగు అపవాదలు మాచంద్రోదయమున కేమియు గలుగనేరవు. శాస్త్రవిహితములగు అనుపానములిందు జేర్చబడియుండుటచే వేరుగ నేమియు జేర్చనవసరములేకుండ తేనెతోగాని, నేతితోగాని, పంచదారతోగాని తాంబూలముతోగాని, సమస్తవ్యాధులయందు నుపయోగింపవచ్చును. ఇది క్షయ, శుక్లనష్టము, బలహీనత, దగ్గు, ఆయాసము, గుండెదడ, రక్తముచెడుట, మధుమేహము, అతిమూత్రము, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము, పక్షవాతము, జీర్ణించిన సవాయివ్యాధులు, జీర్ణించినసెగవ్యాధులు, జీర్ణజ్వరము, అజీర్ణము, కాళ్ళుచేతులుమంటలు, కళ్ళుతిరుగుట, నడుమునొప్పులు, ప్రమేహవ్యాధులు మొదలగువానియందమోఘముగ పనిచేయును. రక్తవృద్ధిని, రక్తశుద్ధినిచేసి శరీరమునకు కాంతిని గలిగించును. నరములకు పటుత్వమును సంభోగశక్తిని వృద్ధిపరచును. దీనియొక్క గుణములు అందరికి తెలిసియుండుటచే నింతకంటె వివరించి వ్రాయలేదు. మోతాదు ¼ చిన్నంమొదలు ½ చిన్నం వరకు తు 1 కి రు 12-0-0.

## —* 4 వసంతకుసుమాకరము *—

ఇందు పంచిముఖ్యము భస్మ, బంగారుభస్మ మొదలగు విలువగల భస్మములు చేరియున్నవి. బసవరాజీయాది గ్రంథములయందు కొద్దిపుష్పములచేతనే భావన చెప్పబడియున్నను "ఇందు శనగగింజల నానించినచో మొలకలెత్తవలె" ననెడి సాంప్రదాయ వాక్యమున కర్థమును గ్రహించి అనేకవిధములగు పుష్పరసములు పోసి తయారుచేసితిమి. (1) తుంగగడ్డలు, మర్రిచెక్క, వెలగవేళ్ళు, దానిమ్మకాయబెరళ్ళు, కొడిశపాలవిత్తులు, వీనియొక్క కషాయముతో సేవించినయెడల దీర్ఘకాలమునుండియున్న తెల్లకుసుమ, ఎర్రకుసుమ, గ్రహణివ్యాధులు, రక్తవిరేచనములు, ఇవి వెంటనే నశించును. (2) వసంతకుసుమాకరం 1/4 తు, జాజికాయలు 1/8 తు, తిప్పసత్తు 1/8 తు, నల్లమందు 1/8 తు, నేరేడుపప్పు 1/8 తు, చింతగింజలలోనిపప్పు 1/8 తు, వీనిని నేరేడుచెక్క కషాయముతో నూరి 31 మాత్రలు కట్టి ఒక్కొక్క మాత్ర చొప్పున ఉదయము ఎండుఖర్జూరపుకాయకషాయముతోడను, సాయంకాలము మేడిచెక్క కషాయముతోడను, సేవించినయెడల మధుమేహము, అతిమూత్రము, దగ్గు, ఆయాసము, శుక్లనష్టము, శీఘ్రస్ఖలనము, వీర్యము పలచగనుండుట, కాళ్లులాగుట, నడుమునొప్పులు, సమస్తమగు ప్రమేహవ్యాధులు మొదలగునవి నిశ్చయముగ నశించును. రోగవ్యాధి 5-6 మోతాదులకే మాయమగును. ఇందు 1/4 తులము అభ్రకమును కూడ చేర్చినచో మిక్కిలి గుణవత్తరముగ నుండును. కొన్ని తత్వములకు నల్లమందు సరిపడదు. తోచినయెడల దానిని మానవలెను. మిగతావస్తువులనే చేర్చవలెను ( ) త్రిఫలములు, రావిచెక్క, వట్టివేళ్ళు, సుగంధిపాల వీనియొక్క కషాయముతో సేవించినయెడల దీర్ఘకాలమునుండియున్న నోటిపూత, రక్తపిత్తము, కండ్లు ఎర్రగనుండుట మొదలగు నేత్రవ్యాధులు, కాళ్ళు చేతులు మంట, రక్తదోషములు, చర్మవ్యాధులు, సవాయివ్యాధులుగాని సెగవ్యాధులుగాని జీర్ణించుటచే కలిగిన వ్యాధులు, ఇవి సూర్యరశ్మిచే చీకటివలె పారిపోవును. ముఖమునకు తేజస్సును, శరీరమునకు కాంతియు కలుగును. ఇందు జీలకర్రను కూడ కలిపినచో పైత్యవ్యాధులుకూడ నశించునని వేరుగ వ్రాయనక్కరలేదు. (4) చాతుర్జాతకములు, చెంగల్వకోష్టు, తవక్షీరి, వీని యొక్క చూర్ణము 1 తు, వసంతకుసుమాకరము 1/2 తు, వీనిని గలిజేరురసముతో నూరి 41 మాత్రలుకట్టి ఉదయము సాయంకాలము, కొద్దిగ వటికబెల్లపు చూర్ణము వేయబడిన ఆవుపాలతో సేవించినయెడల క్షయ, శరీరము శుష్కించుట, పాండువు, కామిల్ల, బలహీనత, గుండెదడ, ఉరఃక్షతము, కల్లెతోకూడిన దగ్గు, ఆయాసము, తిమ్మిర్లు, ఇవి నిశ్చయముగ శాంతించును. (5) సరస్వతీయాకు రసముతో 2-3 నెలలు విడువక సేవించుచు మా అమృతామలకతైలము శిరస్సుకు మర్దించుచు ఉదయము సాయంకాలము శిరస్సుకు చన్నీటిస్నానమును బాగుగ చేయించినయెడల మేహముడుకుచేగాని పైత్యముడుకుచేగాని కలిగిన ఉన్మాదము, అపస్మారము, మూర్ఛ, జ్ఞాపకశక్తి సరిగలేకపోవుట, మొదలగు మెదడువ్యాధులు

మొదలంట నశించును. మరియు నిద్ర సరిగపట్టకపోవుట, శిరస్సుపోటు, పార్శ్వపునొప్పి, కండ్లు ఎర్రగనుండి నీళ్ళుకారుచుండుట, మొదలగువ్యాధులు కడు ఆశ్చర్యముగ హరించును. మనోవికాసతయు, నేత్రనైర్మల్యమును, కలుగును. (6) నేలతాడి, పెన్నేరు, పిల్లితేగలు, నేలగుమ్మడి, రూమ్యామస్తకి, వీనియొక్క చూర్ణము ¾ తు, వసంతకుసుమాకరము ¼ తు, వీనిని నేలగుమ్మడి కషాయముతో నూరి 30 మాత్రలుకట్టి ఉదయము సాయంకాలము ఆవుపాలతో సేవింపవలెను. ఇట్లు 1-2 నెలలు సేవించినయెడల తరుచుగర్భములు పోవుచుండుట, జనించినసంతానము నీరసముగనుండుట, స్తన్యము సరిగ లేకుండుట, యోనిదోషములు మొదలగు స్త్రీలకుకలుగు వ్యాధులన్నియు నశించును. గొడ్డురాలుకూడ గర్భవతియగును. అధికమగు సంతానమును కోరినవారు దీనినిట్లు కొంతకాలము సేవించినచో ఫలసిద్ధిని పొందగలరు. దీనిని రాజౌషధముగ 2-3 నెలలు సేవించినయెడల శరీరమందలి ఉడుకు సమశీతమునకు వచ్చి తత్వము స్థిరాయించి (మారి) సమస్తవ్యాధులు నశించునటలో నతిశయోక్తి ఇసుమంతయు లేదు. మరియు దీని సేవనచే అధికమగు వీర్యవృద్ధిని కామోద్రేకమునుపొంది స్త్రీని ఏనుగువలె రమించును. పురుషులకు గలుగు శుక్లదోషముచేకూడ సంతానము లేకుండును. శుక్రదోషములను నశింపజేయుటలో నిది యగ్రగణ్యమైనది. కాన సంతానములేని ప్రతిమనుష్యుడును తప్పక సేవింపవలసి యుండును. మరియు శరీరము ముడుతలు పడుట, వెండ్రుకలు నెరయుట, మొదలగు లక్షణములుతగ్గి యౌవనవంతుడై నూరు సంవత్సరములు జీవించును. దీనియందు యోగవాహి యనెడి మహాశక్తిగలదనియు అనుపానభేదములచే వాతపిత్తశ్లేష్మవ్యాధుల నన్నిటినిగూడ నశింపజేయుననియు శాస్త్రములయందు చెప్పబడియున్నది. మోతాదు ¼ చిన్నం మొదలు ½ చిన్నంవరకు.

తు 1 కి రు 20-0-0

## —* 5 కాంతవల్లభరసము *—

క్రమప్రకారము ఏడురోజులు వండబడినది. దీనియందు శాస్త్రములయందు మహామహిమ కలదిగ చెప్పబడిన గోమూత్రశిలాజితు చేర్పబడినది. అందుచే బహు చక్కగ పనిచేయును. (1) తాలీసపత్రి, శుంఠి, మిరియాలు, నాగకేసరాలు, దాసెనచెక్క వీనియొక్క చూర్ణము ½ తు, కాంతవల్లభరసము ¼ తు, వీనిని 15 పొట్లములుకట్టి ఉదయముసాయంకాలము వేడినీటితో సేవించినయెడల పాండువు, నంజు, కామిల, అజీర్ణము, తిమ్మెర్లు, ఉదరవ్యాధులు, యకృత్ వ్యాధులు, ప్లీహవ్యాధులు, జీర్ణజ్వరము, అగ్నిమాంద్యము మొదలగు వ్యాధులు దగ్ధమగును. (2) తాలీసపత్రి, చెంగల్వకోష్టు, తవక్షీరి, ఏలకాయలు, లవంగాలు, మిరియాలు, వీనియొక్క చూర్ణము 1 తు, కాంతవల్లభరసం ¼ తు, వీనిని 15 పొట్లములుకట్టి ఉదయము సాయంకాలము మందుపొట్లమునకు రెట్టింపు పటికిబెల్లపు చూర్ణము కలిపి సేవించిన యెడల క్షయ, దగ్గు, ఆయాసము, గుండెవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, (3) సన్నరాష్ట్రము, వాయులవంగాలు, గంటుభారంగి వీనియొక్క చూర్ణమును సమానముగ చేర్చి

తేనెతో సేవించినయెడల పక్షవాతము, చచ్చువాతము, సర్వాంగవాతము, అర్దితవాతము, సూతికావాతము, మొదలగు సమస్తవాతములు, (4) పంచకోలచూర్ణము రెట్టింపుచేర్చి వేడినీటితో సేవించినచో ఋతుశూల, బహిష్టు సరిగా కాకుండుట, ఋతుదోషము, రక్తగుల్మము, (5) తేనెతో సేవించినయెడల దీర్ఘకాలగతమగు గ్రహణి, అతిసారము, అమవిరేచనములు, స్థౌల్యరోగము, (శరీరము లావుపారుట) (6) రెట్టింపు మేడికాయలచూర్ణముతో సేవించి వెలగవేళ్ళ కషాయమును త్రాగినయెడల వాతతత్వమునకుగాని శ్లేష్మతత్వమునకుగాని కలిగిన మధుమేహము, అతిమూత్రము, ప్రమేహవ్యాధులు, ఇవినిశ్చయముగ సింహస్వప్నముచే ఏనుగు నశించురీతి నశించును. సామాన్యమగు మలబంధము కలవారు సమస్తవ్యాధులయందు 2, 3 రెట్లు త్రిఫలాచూర్ణముతోడను, అధికమగు మలబంధముకలవారు రెట్టింపు తెల్లతెగడ చూర్ణముతోను సేవించి కొద్దిగ వేడినీటిని త్రాగినయెడల విరేచనము చక్కగనగుచు వ్యాధులన్నియు నశించును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1 కి రు 4-0-0

## —* 6 సువర్ణకాంతవల్లభరసము *—

గుణములు, అనుపానములు, మొదలగువానికి కాంతవల్లభరసమునకు వలెనే చూచుకొనుడు. ఇందు బంగారము, వెండి, తామ్రము మొదలగునవి కలయుటచే కాంతవల్లభరసముకంటె బహుచురుకుగ నమోఘముగ పనిచేయును. తు 1కి రు 6-0-0

## —* 7 వాతరాక్షసము *—

దీనిని (1) శుంఠి, పిప్పళ్ళు, గంటుభారంగి, వీనియొక్క చూర్ణము సమానముగ చేర్చి చిత్రమూలరసముతో నూరి కందిగింజలువలె మాత్రలుచేసి వేడినీటితో నుపయోగించినయెడల చచ్చువాతము, ధనుర్వాతము, ఆక్షేపకవాతము, పక్షవాతము మొదలగుసమస్తవాతవ్యాధులు, (2) అడ్డసరము నీటిఆవిరిమీద ఉడికించి రసముపిండి యారసముతో నుపయోగించినచో ఆయాసము, దగ్గు, క్షయ, మొదలగు చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు, శ్లేష్మవ్యాధులు, (3) కాలకూటము మొదలగువాటితో కలిపి నూరి తులసియాకు లేక తమలపాకురసముతో నూరి మాత్రలు కట్టి అల్లపురసముతోడను వేడినీటితోడను సమయానుకూలముగ ఉపయోగించినచో దోషజ్వరములు, వాతజ్వరములు, సన్నిపాతజ్వరములు, శ్లేష్మజ్వరములు, సూతికాజ్వరములు మొదలగు కఠినజ్వరములు, (ఈ జ్వరములు కొంచెము శీతగతిగనున్నచో నీమాత్రలయందుకొద్దిగ కస్తూరికూడకలుపుకొనుట మంచిది) (4) తేనెతో రెండుపూటలయందు నుపయోగించినచో తిమ్మిర్లు, వాతాజీర్ణము, వడలునొప్పులు, జలుబు, కీళ్ళనొప్పులు, మొదలగు వ్యాధులు రామబాణముచే రావణునియొక్క శిరస్సులువలె ఖండింపబడును. ఇందు తామ్రము లోహము మొదలగు వస్తువులు కలవుగాన చక్కగ వేడిచేయుచు వాతశ్లేష్మ వ్యాధులనన్నిటిని కూలద్రోయును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు. 1కి రు 4-0-0.

## —✽8 సువర్ణ వాతరాక్షసము. ✽—

ఇది వాతరాక్షసముయొక్క గుణములను గలిగియుండుటయేగాక సువర్ణభస్మము మొదలగు ననేకవస్తువులు ఇందు చేరియుండుటచే ఇంకను అనేకవిధములుగ పని చేయును. అనుపానము మొదలగువానిని వాతరాక్షసమునకు వలెగ్రహింపుడు.

తు 1కి రు 8-0-0

## —✽9 వాతవిధ్వంసి ✽—

దీనిని (1) కమలపాషరసముతో నూరి కందిగింజలవలె మాత్రలుచేసి వేడినీటితో ప్రయోగించినయెడల కంపవాతము, సర్వాంగవాతము, మొదలగు వాతవ్యాధులు, (2) సన్నిపాతభైరవి మొదలగువానితో కలిపి మునగచెక్క రసముతోనూరి కందిగింజలవలె మాత్రలుచేసి వ్యాధినను సరించి అల్లపురసముతో నుపయోగించిన యెడల నూతికాజ్వరములు, దోషజ్వరములు, సన్నిపాతజ్వరము మొదలగుజ్వరములు (3) శుంఠిరసముతో నుపయోగించినయెడల జ్వరమునందు విరేచనములగుచుండుట, అజీర్ణవిరేచనములు, అజీర్ణము (4) తులసాకు రసముతో నుపయోగించినయెడల చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు, అజీర్ణవిరేచనములు, జలుబు, జ్వరము, దగ్గు, మొదలగు వ్యాధులు వెంటనే హరించును. కొందరు దీనిని నూతికాభరణమునకు బదులుగ వాడుచుందురు. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు తు 1 కి రు 2—0—0

## —✽ 10 మహావాతవిధ్వంసి ✽—

ఇందు నాభి మొదలగు తీవ్రగుణముగల వస్తువులధికముగ చేరియుండుటచే వెంటనే అధికమగు వేడిని చేయును. కాన నూతికాజ్వరము మొదలగువానియందు వెంటనే పనిజేయును. జాగ్రతగ వాడవలయును మోతాదు ¼ చి॥ మొ॥ ⅓ చి॥వరకు.

తు 1 కి రు 4—0—0

## —✽ 11 వాతగజాంకుశము ✽—

ఇందు ముషిణిగింజలు కలయుటచే ననేకవ్యాధులమీద పనిచేయును. దీనిని నూరి పొట్లములుకట్టి (1) తేనెతో సేవించినయెడల ఊరుస్తంభము, కంపవాతము, పక్షవాతము, తిమ్మిరవాతము, అర్దితవాతము, ఆక్షేపకవాతము, మొదలగు వాతములును, గుండెవ్యాధులును, నరములబలహీనతయు, (2) శుంఠిరసముతో అజీర్ణము, మలబంధము, ఆకలి సరిగలేకపోవుట, మొదలగునవియు నశించును. మాత్రలుగకట్టి వేడినీటితోకూడ నుపయోగించవచ్చును. మోతాదు ¼ చి॥ మొ॥ 1 చి॥ వరకు.

తు 1 కి రు 1—0—0

## —✽ 12 రజతచంద్రోదయము ✽—

ఇందధికమగు వెండి చేరియున్నది. అందుచే శుక్లదోషములమీద బహుచక్కగ పనిజేయును. (1) చాతుర్జాతకచూర్ణమును రెట్టి పుకలిపి వెన్నతో సేవించినయెడల శుక్లనష్టము, శుక్లము నీరువలెనుండుట, బలహీనత, (2) అతిమధురము, నాగకేసరములు, తవక్షీరి, వీనియొక్కచూర్ణమును రెట్టింపుకలిపి పంచదారతో సేవించినచో

ఉడుకు, దగ్గు, ఆయాసము, నడుమునొప్పులు, కాళ్లులాగుట, గుండెదడ (3) చలువ (తోక) మిరియాలు, అతిమధురము, తెల్లచందనము పొట్టు, వీనియొక్క చూర్ణమును సమానముగ చేర్చి సేవించినయెడల సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, నోటిపూత (4) త్రిఫలాచూర్ణము, తిప్పసత్తు, నేరేడుపప్పు, వీనిని మూడు రెట్లు చేర్చి బియ్యపుకడుగుతో సేవించినచో శ్వేతప్రదరము, రక్తప్రదరము, మధుమేహము, అతిమూత్రము, ప్రమేహములు, వెంటనే నశించును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు

తు 1 కి రు 4—0—0

## —* 13 లఘుసూర్యావర్తి *—

ఇది (1) మాదీఫలరసాయనముతో అరుచి, నోటనీరూరుట, పసరువాంతి అగుట, వికారముగనుండుట, ఛర్ది, ఎక్కిళ్ళు, గుండెదడ, వడలుతిరుగుట, నోరు అసహ్యముగనుండుట (2) అల్లపురసముతో అజీర్ణము, ఆకలి సరిగ లేకపోవుట, దద్దుర్లు, తలనొప్పి, మలబంధము, తలతిరుగుట, (3) రెట్టింపు పంచదారతో ఉడుకు, దగ్గు, ఆయాసము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, (4) ద్రాక్షపండ్లరసముతో తిమ్మిర్లు, ఉన్మాదము, దద్దుర్లు, శరీరతాపము, మూర్ఛ, అపస్మారము, వీనియందమోఘముగ పనజేయును. పైత్యముచేతను, వేడిచేతను కలిగిన వ్యాధులయందు చక్కగపనిజేయును. తేనెతోగాని మాదీఫలరసాయనముతోగాని యుపయోగించినయెడల గర్భిణీస్త్రీలకుకలుగు వ్యాధులన్నిటిని నివారింపజేయును. దీనిని గర్భిణీస్త్రీలు తరుచువాడుట అనేకవిధముల మంచిది. మోతాదు ¼ చి॥ మొ॥ ¾ చి॥ వరకు తు 1 కి రు 2-0-0

## —* 14 సువర్ణసూర్యావర్తి *—

ఇందు కస్తూరియు బంగారమును చేరియున్నవి. అందుచే పైలక్షణములయందు, పైఅనుపానములతో బహుచక్కగను చురుకుగను పనిచేయును. కాని పైలక్షణములు మేహవాతములచేగాని వాతపిత్తములచేగాని కలిగినప్పుడే బహుచక్కగపనిచేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు

తు 1 కి రు 6-0-0.

## —* 15 వంటసువర్ణసూర్యావర్తి *—

ఈయోగము అధికమగు వ్యయప్రయాసలతో సంపాదించబడినది. ఇందనేకములగు భస్మలు చేరియున్నవి. అందుచే సమస్తవిధములగు పైత్యవ్యాధులను అమోఘముగ శాంతింపజేయుటయేగాక క్షయ, ప్రమేహములు, మధుమేహము, మొదలగు వ్యాధులనుకూడ నిస్సందేహముగ వెంటనే నశింపజేయును. ఇది (1) ఎండుఖర్జూరపుకాయగంధముతో నోటిపూత, తలతిరుగుట, మధుమేహము, ఉడుకు, ప్రమేహవ్యాధులు, కాళ్ళుచేతులుమంట, శరీరతాపము, దగ్గు, ఆయాసము (2) అల్లపుగంధముతో అరుచి, నోటనీరూరుట, అజీర్ణము, అగ్నిమాంద్యము, ఎక్కిళ్ళు, దద్దుర్లు, కామిర్లు, వాంతి, (3) ద్రాక్షపండ్లరసముతో గుండెదడ, (4) వెన్నతో క్షయ, (5) సారస్వతఘృతముతో ఉన్మాదము, అపస్మారము, మూర్ఛ, జ్ఞాపకశక్తితప్పవగనుండుట, (6) పంచదారతో శ్వేతరక్తప్రదరములు, రక్తపిత్తము, శుక్లనష్టము,

కాళ్లులాగుట, దాహమధికముగ నుండుట, బలహీనత, శరీరముశుష్కించుట, వీనిని చిత్రముగ నశింపజేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥వరకు తు1కి రు 8-0-0

## —* 16 లఘులక్ష్మీవిలాసరసము *—

దీనిని (1) తేనెతో నిచ్చినయెడల పసిపిల్లలకు కలుగు దగ్గు,జలుబు, ఎగరొప్పు, ఉడుకు,వాంతి మొదలగునవియు (2)ద్రాక్షపండ్లరసముతో నిచ్చినయెడల పెద్దవారలకు కలుగు కాళ్లుచేతులమంటలు, ఉడుకువ్యాధులు, పైత్యవ్యాధులు, (3) లేనెతో ఇచ్చినయెడల వాతవ్యాధులు మొదలగునవియు నశించును. మోతాదు ¼ చి॥మొ॥ ½, చి॥ వరకు తు 1కి రు 1-0-0.

## —* 17 క్రమవృద్ధి మహాలక్ష్మీ విలాసరసము *—

ఇందు సువర్ణభస్మ, సీసభస్మ, పగడభస్మ,ముత్యభస్మ, మొదలగు దివ్యములైన భస్మలు భాగోత్తరవృద్ధిగ చేరియున్నవి. ఉడుకువ్యాధులను నశింపజేయుటలో నింతటి ఔషధరాజము వేరొకటిలేదు. (1) పెన్నేరు, నేలగుమ్మడి, ఏలకాయలు, తాలీసపత్రి, అడ్డసరపువేళ్లు, వీనియొక్క రెట్టింపుచూర్ణముతో క్షయలు, దగ్గు, ఆయాసము, శరీరబలహీనత, శుష్కించుట, ఉరఃక్షతము, (2) అడ్డసరపురసముతో రక్తపిత్తము (3) ధనియాలరసముతో పైత్యవ్యాధులు, (4) జీలకర్ర రసముతో అరుచి, నోరు అసహ్యముగ నుండుట, (5) జాజికాయ, జాపత్రి, సమానముగు వీనియొక్కచూర్ణము, తేనె వీనితో నోరుదుర్గంధముగ నుండుట, (6) నేలతాడి, బూరగబంక, సుగంధిపాల, వీనియొక్కచూర్ణమును రెట్టింపు కలిపి పంచదారతో సేవించినయెడల శుక్లనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, ప్రమేహములు, శుక్రము క్షీణించుట, శుక్రము నీరువలెనుండుట, నాడి నీరసముగ నుండుట, (7) రెట్టింపు త్రిఫలాచూర్ణము కలిపి చన్నీటితో సేవించినయెడల నోటిపూత, శరీరమెల్లప్పుడు వెచ్చగనుండుట, దీర్ఘకాలమునుండి యున్న గ్రహణివిరేచనములు, రక్తాతిసారము, మొదలగువానిని నశింపజేయును. ఉడుకువలన కలిగిన వ్యాధులను నశింపచేయుటలో నింతటిమందు లేదని స్వానుభవముగ చెప్పగలము. దీనినే ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మీవిలాసరసమనియు, భాగవృద్ధి మహాలక్ష్మీ విలాసరసమనియుకూడ అనెదరు. మోతాదు ¼ చి॥మొ॥ ½ చి॥ వరకు తు 1కి రు 8-0-0.

## —* 18 లఘుసిందూరభూషణము *—

ఇది (1) రెట్టింపు సితోపలాదిచూర్ణము చేర్చి పటికబెల్లపుచూర్ణముతో సేవించినచో పొడిదగ్గు, ఆయాసము, కాళ్ళు చేతులు మంటలు, (2) రెట్టింపు త్రిఫలాచూర్ణముతో నోటిపూత, శుక్లనష్టము, గుండెదడ, కడుపులోమంట, కాళ్ళులాగుట, బలహీనము, శరీరము వెచ్చగనుండుట, ఇరువది ప్రమేహములు, రక్తార్శస్సు, రక్తాతిసారము, (3) సమానముగు త్రివంగభస్మ, రెట్టింపు దాసెనచెక్కచూర్ణము, కలిపి మీగడతో సేవించినచో శ్వేతప్రదరము, రక్తప్రదరము, సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము మొదలగు ఉడుకుసంబంధమగు వ్యాధులను వెంటనే నశింప జేయును.

(4) మాదీఫలరసాయనముతో గర్భిణీస్త్రీలకు కలుగు సమస్తవ్యాధులను నశింపజేయును. మరియు సుఖప్రసవమును చేయును. గర్భములు తప్పుపోవువారు గర్భము వచ్చినది మొదలు దీనిని 2-3 నెలలు సేవించుట అనేకవిధముల మంచిది.
మోతాదు ½ చి॥ మొ॥ ¾ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

## —* 19 మహా సిందూరభూషణము *—

ఇందు బంగారుభస్మ మొదలగునవి కలిసినవి. (1) చ్యవనప్రాశతో క్షయలు, దగ్గు, ఆయాసము, బలహీనత, (2) త్రిఫలాచూర్ణముతో శుక్లనష్టము, నోటిపూత, మధుమేహము, అతిమూత్రము, రక్తవమనము, కాళ్ళుచేతులు మంటలు, ఇరువది ప్రమేహములు, (3) రెట్టింపు సుగంధిపాలచూర్ణముతో శరీరతాపము, రక్తదోషములు, (4) నేరేడుచెక్క కషాయముతో స్త్రీలకు కలుగు రక్తప్రదరము, శ్వేతప్రదరము, గర్భస్రావము, (5) జీలకర్రరసముతో పైత్యవ్యాధులు,(6) గొబ్బరికాయ నీటితో సెగవ్యాధులు, మూత్రనాళమంటలి మంట, మూత్రము ఆగిఆగివచ్చుట, మొదలగువ్యాధులను వెంటనే మొదలంట త్రుంపివేయును. దీనిని సువర్ణసిందూరభూషణమనికూడ యందురు.
మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1 కి రు 8-0-0.

## —* 20 లఘు క్రవ్యాది *—

శాస్త్రప్రకారము భావనలన్నియు యథావిధిగా చేయబడినది. అజీర్ణములను నశింపజేయుటలో నత్యుత్తమమైనదని అందరికిని తెలిసినవిషయమే. దీనిని (1) 3-4 తులముల పుల్లనిమజ్జిగ, ½ తులము సైంధవలవణము, వీనితో కలిపి భోజనమైన వెంటనే సేవించినయెడల కఠినమైన అజీర్ణము, అగ్నిమాంద్యము, పుల్లని త్రేణుపులు, కడుపుబ్బరము, పేగులరచుట, ఉదరవ్యాధులు, అరుచి,వాంతి, (2) వామురసముతో సమస్తశూలలు (3) శుంఠిరసముతో ఆమవిరేచనములు, (4) అల్లపురసముతో తలతిరుగుట మొదలగు పైత్యవ్యాధులు, తిమ్మెర్లు, ఇవి వెంటనే నశించును. ఇందు తామ్రభస్మ మొదలగు తీక్ష్ణగుణముగల వస్తువులు కలియుటచే కొందరికి కొద్దిగ వేడిచేయును. కాన నోటిపూత మొదలగు ఉడుసులక్షణములుకల అజీర్ణవ్యాధులయందు వేడిచేయకుండుటకై సమానమగు పైత్యాంతకమునుగాని అభ్రకభస్మనుగాని కలిపివాడవలయును. దీనిని సేవించునప్పుడు రాత్రులయందైననూ భోజనము మాని త్వరలో జీర్ణమగు జావలు, పాలు మొదలగువానిని తీసికొనుట శ్రేష్టము.
మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు తు 1కి రు 2-0-0.

## —* 21 సువర్ణక్రవ్యాది *—

ఇందు సువర్ణభస్మ మొదలగు కొన్నిభస్మలు అధికముగ కలియుటచే కొంత యధికముగ పనిచేయును. గుణములు, అనుపానములు, మొదలగువానికి లఘుక్రవ్యాదికివలెనే తెలిసికొనుడు. తు 1కి రు 4-0-0

## —* 22 లఘుమేహాంతకము *—

(1) దాసెనచెక్క, ఏలకాయలు, వీనిచూర్ణమును మూడురెట్లుచేర్చి పంచదారతో సేవించినచో సెగవ్యాధి, శుక్లనష్టము, మూత్రకృచ్ఛ్రము, నోటిపూత, ఇరువదిమేహములు, (2) రెట్టింపు పుష్యానుగచూర్ణముతో స్త్రీలకుగలుగు యోనిదోషములు, శ్వేతప్రదరము, రక్తప్రదరము, నడుమునొప్పులు, కాళ్ళులాగుట, (3) రెట్టింపుత్రిఫలాచూర్ణముకలిపి మీగడతో సేవించినచో కడుపులోమంట, శరీరమెల్లప్పుడును వెచ్చగనుండుట, కళ్ళమంటలు, కాళ్ళమంటలు, నిస్సత్తువ, శిరస్సువేడిగనుండుట, (4) నాల్గురెట్లు పటికబెల్లపు చూర్ణముతో సేవించినచో పొడిదగ్గు, ఇవి శీఘ్రముగ హరించును. మోతాదు ¼ చి॥ మొ॥ 3/4 చి॥ వరకు తు 1కి రు 2-0-0.

## —* 23 మహామేహాంతకము. *—

ఇందు సువర్ణాభ్రకమౌక్తికాది భస్మములు గలవు. (1) చందనంపొట్టు, కురువేరు, తుంగగడ్డలు, వీనియొక్క రెట్టింపుచూర్ణము వెన్న వీనితో ఇక్షుమేహము, అతిమూత్రము, మధుమేహము, సురామేహము, వసామేహము, హారిద్రామేహము, శుక్లమేహము, (2) యష్టిమధుకము, నేలగుమ్మడి, అడ్డసరపువేళ్ళు, వీనియొక్క మూడురెట్లచూర్ణము, తేనె, వీనితో పాండువు, రాజయక్ష్మ, కృశించుట, ఆయాసము, దగ్గు, దౌర్బల్యము, ఉత్థాపనశక్తి లేకపోవుట, రక్తపిత్తము, కాళ్ళుచేతులు మంటలు, (3) మిరియాలు, జీలకర్ర, వాయువిడంగములు, వీనియొక్క రెట్టింపు చూర్ణముకలిపి అరటిదుంపరసముతో సెలనాదు, నడుమునొప్పులు, మూత్రమునకు పోవునపుడు మంట, జీర్ణజ్వరము, అజీర్ణము, రక్తార్శస్సు, గ్రహణి, ప్రదరములు, వీనిని హరింపజేయును. దీనిసేవనచే శరీరకాంతి, బుద్ధిబలము, ఇంద్రియబలము కలుగును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు తు 1కి రు 8-0-0.

## —* 24 సువర్ణ మాల్యవసంతము *—

ఇది ఉడుకువలన కలిగినవ్యాధులనన్నిటిని నశింపజేయునని అందరికిని తెలిసిన విషయమే. (1) రెట్టింపు పిప్పళ్ళచూర్ణము, తేనె వీనితో క్షయ, దగ్గు, ఆయాసము, జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము, జీర్ణాతిసారము, (2) రెట్టింపు ఉసిరికపప్పుచూర్ణము, వెన్న, వీనితో రక్తాతిసారము, రక్తార్శస్సు, రక్తదోషములు, పైత్యవ్యాధులు, ప్రదరములు, నేత్రవ్యాధులు, (3) తెల్లకలువపుష్పరసముతో గర్భిణిస్త్రీలకు కలుగు సమస్తవ్యాధులు, (4) తేనెతో పసిపిల్లలకుకలుగు సమస్తఉడుకువ్యాధులు, వీనిని హరింపజేయును. గర్భమునకు బలమునిచ్చును. శరీరపుష్టిని, శరీరకాంతిని, ఇంద్రియ బలమును చేయును. శుక్రమునుచిక్కపరచును. పాలుచిలకగ వచ్చినవెన్నలో దీనిని వాడుట శ్రేష్టము. మోతాదు ¼ చి॥ మొ ½ చి॥ వరకు తు 1కి రు 10-0-0.

## —* 25 బాలసూర్యోదయము *—

ఇది (1) తేనెతో జీర్ణజ్వరము, దగ్గు, ఆయాసము, వాంతి, పాండువు, ప్లీహ వ్యాధులు, క్షయ (2) శుంఠిరసముతో గుల్మము, అజీర్ణము, ఉదరవ్యాధులు, (3) రెట్టిం

పు తానికాయబెరళ్ళచూర్ణముతో ప్రదరములు, యోనిదోషములు, లింగదోషములు వీనిని హరింపజేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥వరకు తు 1కి రు 2-0-0.

—* 26 వంటబాల సూర్యోదయము *—

ఇది ఉదుకవ్యాధులను ప్రదరవ్యాధులను హరింపచేయుటలో శ్రేష్టమైనది. (1) పిప్పళ్లు, జీలకర్ర, వీనియొక్క రెట్టింపుచూర్ణముతో జీర్ణజ్వరములు, పురాణజ్వరములు, దగ్గు, ఆయాసము, పైత్యవ్యాధులు, శ్లేష్మవుడుకువ్యాధులు, (2) మేడిచెక్క, త్రిఫలములు, వీనియొక్క రెట్టింపుచూర్ణము, పంచదార, వీనితోనోటిపూత, సమస్తమగు ప్రదరవ్యాధులు, యోనిదోషములు, మూత్రకృచ్ఛ్రము, శుక్లస్రావము, మధుమేహము, కుష్ఠించుట, శరీరమెల్లపుడు వెచ్చగనుండుట, బలహీనత, కాళ్ళులాగుట, నడుమునొప్పులు, కాళ్ళు చేతులుమంటలు, (3) ఎండు ఖర్జూరపుకాయలరసముతో బాలురకు కలుగుఉదుకవ్యాధులు వీనిని వెంటనే హరింపజేయును.

మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు తు 1కి రు 4-0-0.

—* 27 రజతలోహరసాయనము *—

ఇందు వెండియు లోహము అధికముగ చేరియుండును. అందుచే మహావాతవ్యాధులన్నిటిమీదను బహుచక్కగపనిచేయును. (1) రెట్టింపు త్రికటుచూర్ణముతో జీర్ణము, పాండువు, జీర్ణజ్వరము, నంజు, తిమ్మెర్లు(2)లవంగాలు,సన్నరాష్ట్రము,తవక్షీరినియొక్క మూడురెట్లుచూర్ణము,తేనె,వీనితోదగ్గు,ఎగరొప్పు,గుండెలోబరువు,శ్లేష్మవ్యాధులు, కంఠమందు వుండవానుండుట, క్షయ, శరీరము లావుపారుట, (3) రెట్టింపు త్రిజాతకచూర్ణముతో ప్రదరవ్యాధులు, శుక్లనష్టము, గుండెవ్యాధులు, కామిర్లు, సంభకామిల, (4) సమానమగు త్రిఫలాచూర్ణముతో పక్షవాతము, అర్దితవాతము, హనుగ్రహము మొదలగు వాతవ్యాధులు (5) తులసియాకు మొదలగువానియొక్క రసముతో చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు మొదలగు శ్లేష్మవ్యాధులు, వీనిని వెంటనే నశింపజేయును. రక్తవృద్ధిని చేయును. దీనిని మహానంజు, శ్లేష్మవ్యాధులు, వాతముతోకూడిన ప్రదరవ్యాధులు శుక్లనష్టముతోకూడిన పాండువు, ప్రసవమైనపిదప కలుగు నంజు, పాండువు, అజీర్ణము, ఆయాసము, వాతవ్యాధులు మొదలగువానియందు ఆయా అనుపానములతో వాడెదరు.

మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి వరకు తు 1కి రు 4-0-0.

—* 28 సువర్ణభూపతి *—

ఇందధికమగు బంగారము కలదు. కాన క్షయలయందమోఘముగా పనిచేయును. (1) వాకుడువేళ్ళు, పిప్పళ్ళు, రెట్టింపు వీనియొక్క చూర్ణము, తేనె వీనితో క్షయలు,దగ్గు, ఆయాసము,(2)సమానమగు త్రికటుచూర్ణముతో అజీర్ణము,గుల్మము, తిమ్మెర్లు, నంజు, ఆఢ్యవాతము, పంగువాతము, సర్వాంగవాతము శూలలు, కడుపుబ్బరము (3) రెట్టింపు పిండిగొండచూర్ణముతో అశ్మరి, మూత్రబంధము (4) కుంకుడు రసముతో ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, ఉదరవ్యాధులు, (5) జంబీరాదిపాన

క్రముతో కామిర్లు, కుంభకామిల (6) గుంటకలగరరసముతో పాండువు, శిరోవాతము, జీర్ణజ్వరము ఇవి "విష్ణుచక్రముచే రాక్షసులువలె" నశించును.

మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు — తు 1కి రు 10-0-0.

### —* 29 రసభూపతి *—

ఇది (1) రెట్టింపు తాలీసాదిచూర్ణముతో దగ్గు, ఆయాసము, (2) రెట్టింపు నాగకేసరాలచూర్ణము, అల్లపురసము, వీనితో అజీర్ణము, అగ్నిమాంద్యము, నంజు, పాండువు, తిమ్మెర్లు, జీర్ణజ్వరము, గుండెవ్యాధులు, (3) అడ్డసరపురసముతో, శ్లేష్మవ్యాధులు (4) ఆవుజెముడాకు లేక తులసియాకురసముతో చంటిపిల్లలకు కలుగు దగ్గు, ఎగరొప్పు, ఆయాసము, జలుబు, అజీర్ణము వీనిని వెంటనే ఖండించును. ఇందు తామ్రభస్మ కలయుటచే తీవ్రముగ పనిచేయును.

మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు — తు 1కి రు 2-0-0.

### —* 30 రసరాట్ *—

ఇది (1) సమానమగు లవంగాలచూర్ణముతో దగ్గు, ఆయాసము, క్షయ, పాండువు, జీర్ణజ్వరము, (2) రెట్టింపు గంటుభారంగి చూర్ణముతో వాతవ్యాధులు, తిమ్మెర్లు, నంజు, శ్లేష్మవ్యాధులు (3) శుంఠి, మిరియాలు, పంచలవణములు, వీనియొక్క మూడురెట్లచూర్ణముతో అజీర్ణము, గుల్మము, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, మలబంధము, గుండెలో బరువుగనుండుట (4) తెల్లజిల్లేడుచెక్క రసము లేక ఆవుజెముడాకులరసముతో శ్లేష్మము ఎదుర్కొనట, చంటిపిల్లలకుకలుగు ఎగరొప్పు, దగ్గు, జలుబు, చంటిబిడ్డగుణము, వీనిని వెంటనే "సూర్యరశ్మి మంచునువలె" హరింపజేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ వరకు — తు 1కి రు 2-0-0.

### —* 31 లోహరసాయనము *—

ఇందధికమగు లోహముకలదు. (1) సమానమగు గలిజేరువేళ్లచూర్ణము, తేనె వీనితో ఆయాసము, దగ్గు, క్షయ, పాండువు, నంజు, కామిర్లు, (2) నల్లేరుచూర్ణము, పసుపు, సమానమగు వీనితో శ్లేష్మవ్యాధులు, మలబంధము, గుల్మములు, ఉదరములు, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, శూలలు (3) తేనెతో తిమ్మెర్లు, వాతవ్యాధులు, అజీర్ణము వీనిని వెంటనే ఖండించును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. — తు 1కి రు 2-0-0.

### —* 32 లోకనాథము *—

ఇది (1) రెట్టింపు గుంటకలగరాకు చూర్ణము, తేనె, వీనితో అజీర్ణము, జీర్ణజ్వరము, నంజు, తిమ్మెర్లు, కామిర్లు, దగ్గు, ఆయాసము, గుండెవ్యాధులు, (2) రెట్టింపు లవంగాలచూర్ణము, తేనె వీనితో క్షయ, జలుబు, శ్లేష్మవ్యాధులు, వాంతి, వీనిని కడుశీఘ్రముగ హరింపజేయును. జాఠరదీప్తిని కలిగించును.

మోతాదు ½ చి॥ మొ॥ 1 చి॥ వరకు. — తు 1కి రు 2-0-0.

## —* 33 కాలకూటము *—

ఇది (1) అల్లపురసముతో పదమూడు సన్నిపాతములు, దోషజ్వరములు, విషజ్వరములు, సమస్తజ్వరములు, శ్లేష్మజ్వరము, (2) వెల్లుల్లి లేక మునగచెక్క రసముతో సూతికాజ్వరములు, కఫమెదుర్కొనుచున్న జ్వరములు, మాంద్యజ్వరములు, వీనిని వెంటనే హరింపజేయును. దీనిని వాతరాక్షసము, సన్నిపాతభైరవి, మొదలగు వానితో కలిపివాడు సాంప్రదాయము కలదు. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥వరకు

తు 1 కి రు 3-0-0.

## —* 34 స్వర్ణవంగము (హేమసుందరరసము) *—

ఇది (1) చలవమిరియాలు, సుగంధిపాలపాట్లు, ఏలకాయలు, దాసెనచెక్క వీనియొక్క మూడురెట్లుచూర్ణము పంచదార వీనితో సెగవ్యాధులు, మూత్రస్థానమందలి మంట, పొడిదగ్గు, పొడిఆయాసము, (2) చందనంపొట్టు, వట్టివేళ్లు వీనియొక్క రెట్టింపుచూర్ణము, వెన్న వీనితో శరీరతాపము, కాళ్లుచేతులు మంటలు, కండ్లుమంటలు, శుక్లనష్టము, ఇరువది ప్రమేహములు, (3) ఉసిరికపప్పు, వట్టివేళ్లు, కర్పూరశిలాజతుభస్మ వీనియొక్క మూడురెట్లచూర్ణము పంచదార వీనితో నోటిపూత, రక్తవమనము, పైత్యవ్యాధులు, దప్పిక, (4) లొద్దుగచెక్క, మంజిష్టి, వీనియొక్క రెట్టింపుచూర్ణము, చిర్రికూర రసము, వీనితో ప్రదరవ్యాధులు, యోనిశూల, గర్భస్రావములు, గుండెదడ, బలహీనత, నడుమునొప్పులు, కాళ్ళులాగుట, సోమరోగము, వీనిని కడు శీఘ్రముగ హరింపజేయుటలో ఎంతమాత్రము సందేహములేదు. దీనియొక్క గుణములు అందరికిని తెలియును కాన ఇంతకంటే వ్రాయలేదు. కొందరు చర్మవ్యాధులను రక్తవ్యాధులనుకూడ వాడెదరు. దీనిని మేము బహుచక్కగ తయారు చేయుచున్నాము.

మోతాదు ½ చి॥ మొ॥ ¾ చి॥ వరకు. తు 1 కి రు 2-0-0.

పటికవేసి స్వచ్ఛమైన రంగులో తయారుచేయబడినది. తు 1కి రు 3-0-0.

మరలవండి బంగారపురంగులో తయారుచేయబడినది. తు 1కి రు 4-0-0.

## —* 35 షడ్గుణము. *—

ఇది ఆరురెట్లగంధకము చేర్చబడి శాస్త్రప్రకారము వండబడినది. ఉడుకువ్యాధులయందమోఘముగ పనిచేయును. (1) సుగంధిపాలపాట్లు, కరక్కాయబెరళ్ళు, నేలగుమ్మడి, తుంగగడ్డలు వీనియొక్క మూడురెట్లచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, శరీరమెల్లప్పుడు వెచ్చగనుండుట, జీర్ణించినసవాయివ్యాధులు, జీర్ణించిన సెగవ్యాధులు, (2) మిరియాలు, తాలీసపత్రి, వీనియొక్క రెట్టింపుచూర్ణము, పటికబెల్లపు చూర్ణము వీనితో పొడిదగ్గు, ఆయాసము, మేహక్షయ, నోటరక్తముపడుట, (3) పిల్లితేగలు, పెన్నేరు, అతిమధురము, వీనియొక్క మూడురెట్లచూర్ణము, వెన్న, వీనితో శుక్లనష్టము, శుక్లము పలచగనుండుట, ఇరువది ప్రమేహములు, శరీరము కృశించుట, పైత్యవ్యాధులు, ప్రదరవ్యాధులు, (4) గుమ్మపాలతో పసిపిల్లలకు కలుగు శరీరము కృశించుట, అజీర్ణము, ఉడుకు, కాసశ్వాసలు, బలహీనత, నరముల పటు

త్వము లేకపోవుట వీనిని వెంటనే నశింపజేయును. ఆరురెట్ల గంధకములో వండబడుటచే రక్తశుద్ధిని బాగుగ చేయును. కాన సమస్తచర్మవ్యాధులయందును రక్తవ్యాధులయందును సవాయివ్యాధులయందును వాడనగును. సరియైన షడ్గుణమును 2-3 నెలలు వాడినచో ఉడుకుతగ్గి రక్తశుద్ధియు రక్తవృద్ధియు శరీరపుష్టియు కలిగి తత్వము స్థిరాయించి (మార్పుజెంద) ఉడుకువలన కలిగిన వ్యాధులన్నియు మొదలంట తగ్గగలవు. 12 సంవత్సరములపలోబడిన వయస్సుకల బాలురకు కలుగు బాలవ్యాధులయందు దీనినే మేము ప్రధానముగ వాడెదము. మూడుసార్లు వండి ఆరురెట్ల గంధకమును జీర్ణింపచేయుటచే వెల యింతకంటె తగ్గించుటకు వీలు కలుగలేదు. ఇట్టి షడ్గుణము లభించుట దుర్లభము. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

—* 36 మేహవంగరాజేయము. *—

ఇది (1) సమానముగు పిప్పళ్ళచూర్ణము, తేనె, వీనితో ఇరువది ప్రమేహములు, మేహక్షయ, కాసశ్వాసలు, (2) రెట్టింపు త్రిఫలాచూర్ణము, కలుబందరసము వీనితో శుక్లనష్టము, కాళ్లుచేతులుమంట, నోటిపూత, శుక్లము నీరువలెనుండుట, ప్రదరవ్యాధులు, (3) రెట్టింపు త్రిజాతచూర్ణముతో అరుచి, నోరు దుర్గంధముగనుండుట, శరీరతాపము, లింగతాపము, వీనిని వెంటనే నశింపజేయును.
మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

—* 37 నవగ్రహి *—

ఇందు తీవ్రగుణముగల విషవస్తువులు కలియును. వెంటనే వేడిచేయును. శ్లేష్మమును తగ్గించును. నాడికి పుష్టినిచ్చును. కరపాదశీతలమును తగ్గించును. (1) అల్లపు రసముతో అరగతీసి యిచ్చినయెడల కఠినస్థితియందున్న సన్నిపాతజ్వరములు, దోషజ్వరములు, విషమజ్వరములు, ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములు, (2) తేనెతో అరగదీసి యిచ్చినయెడల సూతికాజ్వరములు, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, (3) జిట్టవరగోగురసముతో అరగదీసి యిచ్చినయెడల కరపాదశీతలము, రోగికి స్పృహతప్పుట, నాడి నిరసగతిగనుండుట, కఫమెదురొక్కనుట, (4) చనుపాలతో ఇచ్చినచో చంటిపిల్లలకు గలుగు శ్లేష్మజ్వరము, ఎగరోజు, ఆయాసము, పొట్ట ఉబ్బరము, మగత, (5) తేనెతో అరగదీసి యిచ్చినయెడల జీర్ణించిన సవాయివ్యాధులు, చర్మదోషములు, దగ్ధమైపోవును. జాగ్రతగ వాడవలెను. దీనిని జీర్ణించిన సవాయివ్యాధులయందుకూడ ప్రధానముగ వాడెదరు. మరియు జీర్ణించిన చలిజ్వరమందు కూడ వాడెదరు. మోతాదు $\frac{1}{8}$ చి॥ మొ॥ $\frac{1}{4}$ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

—* 38 సింహప్రతిపాలనము. *—

ఇందు గరళమధికముగ కలదు. అందుచే బహుతీవ్రముగ పనిచేయును. సన్నిపాతజ్వరము, దోషజ్వరము, సూతికాజ్వరము, విషూచి (కలరా) వీనియందు కరపాదశీతలము, మగత, ఏర్పడి నాడి నిరసగతిగనున్నప్పుడు 2 మాత్రలు చొప్పున చనుపాలతో 1-2 రెండుగంటలకొకసారి చొప్పున బాగుగ వేడి వచ్చువరకు నుపయోగింపవలయును. కఫమెదురొక్కనుచున్నచో తమలపాకులు లేక తులసాకులు

రసముతో ఇయ్యవలయును. దోషజ్వరములయందు వీనిని కొందరు మొదటినుండి యుకూడ అప్పుడప్పుడు వాడుచుందురు. ఇందు గరళము కలదు. కాన మాత్రను రసములో కలుపునపుడు ఆ వేళకి ఏవిధమగు పొరపాటును పడకూడదు. అట్లు గుండ గరళము మాత్రకలుపువాని శరీరములోనికెక్కి ప్రమాదమును కలిగింపవచ్చును.
మోతాదు 1-2 మా॥ రు 1 కి 10 మాత్రలు.

## —* 39 అగ్నికుమారము. *—

ఇది (1) వాము లేక శుంఠిరసముతో సమస్తాజీర్ణములు, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, త్రేపులరచుట, కడుపునొప్పి (2) అల్లపురసముతో అజీర్ణజ్వరము పైత్యజ్వరము, వాతజ్వరము, (3) దాల్చినచెక్క, వాము, మిరియాలు, వీనియొక్క రసముతో విషూచి (కలరా), అజీర్ణవిరేచనములు, వాంతులు, నీళ్ళవిరేచనములు, (4) వాయువిడంగములరసముతో క్రిమివ్యాధులు (5) చనుపాలు లేక తమలపాకుల రసముతో చంటిపిల్లలకు కలుగుజ్వరము, అజీర్ణము, జలుబు, దగ్గు, మొదలగువానిని వెంటనే నశింపచేయును. మోతాదు ½ చి॥ మొ॥ 1 చి॥ వరకు తు 1 కి రు 1-0-0.

## —* 40 హుతాశనము *—

ఇది (1) శుంఠిరసముతో త్రేణుపులు, కడుపుబ్బరము, అజీర్ణము, (2) అల్లపు రసముతో అరుచి, వాంతి, జ్వరము, తలనొప్పి, మలబంధము, (3) శుంఠి, దాల్చిన చెక్క, వీనియొక్క రసముతో అజీర్ణవిరేచనములు, గ్రహణీవిరేచనములు, (4) వాము రసముతో గుల్మము, ఉదరము, యకృద్వ్యాధులు, (5) మిరియాలు, మిరపకాయలలోని గింజలు, వీనియొక్క కషాయముతో విషూచి (కలరా) (6) భోజనమైన వెంటనే పుల్లనిమజ్జిగ, సైంధవలవణము వీనితో పరిణామశూల, (7) చనుపాలతోగాని వేడినీటితోగాని చంటిపిల్లలకు కలుగు అజీర్ణము, అజీర్ణజ్వరము, మందజ్వరము, మలబంధము, (8) తేనెతో కఫవ్యాధులు, వీనిని వెంటనే హరింప జేయును. అజీర్ణములమీద తీవ్రముగ పనిచేయును. మోతాదు ½ చి॥ మొ॥ 1చి వరకు.
తు 1కి రు 1-0-0.

## —* 41 వైష్ణవీరసము *—

ఇది (1) అల్లపురసముతో సమస్తజ్వరములు, పైత్యజ్వరములు, ద్వంద్వజ్వరములు, సన్నిపాతజ్వరములు, విషమజ్వరములు, పురాణజ్వరములు, (2) తేనెతో జ్వరమందు విరేచనములగుచుండుట, చంటిపిల్లల సమస్తజ్వరములు, వీనిని వెంటనే ఖండించును. మోతాదు ½ చి॥ మొ॥ 1 చి॥ వరకు. తు 1కి రు 1-0-0.

## —* 42 స్వచ్ఛన్నము. *—

ఇది (1) తమలపాకులు లేక తులసియాకురసముతో చంటిపిల్లలకు కలుగు జలుబు, దగ్గు, జ్వరము, కడుపుబ్బరము, వాంతి, అజీర్ణము, విరేచనములు, ఎగరొప్పు (2) తుమ్మిపువ్వుల రసము లేక అల్లపురసముతో విషూచి (కలరా), సన్నిపాత జ్వరము, విషమజ్వరము, జలుబు, దగ్గు, జ్వరములు, (3) శుంఠిరసము, తేనె వీనితో

అజీర్ణము, అతిసారము, వాంతులు, శిరోవ్యాధులు, వీనిని నశింపజేయును.
మోతాదు $\frac{1}{2}$ చి॥ మొ॥ 1 చి॥వరకు. తు 1కి రు 1-0-0.

## —* 43 ఆనందభైరవి *—

ఇది (1) అల్లపురసముతో సన్నిపాతజ్వరము, విషమజ్వరము, పైత్యవ్యాధులు, అజీర్ణము, తలనొప్పి, (2) తేనెతో జ్వరమందు విరేచనములగుచుండుట, దగ్గు,ఆయాసము, కడుపుబ్బరము, ప్రేగులరచుట, (3) రెట్టింపు కొడిశపాలగింజలచూర్ణము, తేనె, వీనితో అతిసారము, గ్రహణి, జిగటవిరేచనములు, రక్తాతిసారము, (4) 2,3 తులముల చవ్యపు కషాయము, $\frac{1}{2}$ తు సైంధవలవణము, వీనితో గుల్మము,శూల, పరిణామశూల, ఉదరవ్యాధులు వీనిని నశింపజేయును. దోషజ్వరములు, జలుబు, శిరోభారము, తలనొప్పి మొదలగువానియందు తేనెతో అరగదీసి కంటిలో కలికముగ నుపయోగింపవచ్చును. మోతాదు $\frac{1}{2}$ చి॥ మొ॥ $\frac{3}{4}$ చి॥వరకు. తు 1కి రు1-8-0.

N. B. ఆరుమాసములు మర్దింపబడినది కాన పైఖరీదు వేయబడినది.

## —* 44 శీతాంశురసము. *—

ఇది (1) అల్లపురసముతో శీతపైత్యజ్వరములు, పైత్యజ్వరములు, సన్నిపాతజ్వరములు, దోషజ్వరములు, ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములు, (2) తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మజ్వరము వీనిని వెంటనే నిశ్చయముగ హరింపజేయును. దోషజ్వరములు, జలుబు, శిరోభారము మొదలగువానియందు నీటితోగాని, తేనెతోగాని అరగదీసి కంటిలో కలికముగ నుపయోగింపవచ్చును. మా ఆయుర్వేదౌషధరత్నాకరమందును బసవరాజీయాదిగ్రంథములయందును అనుపానములువివరముగ వ్రాయబడియుండుటచే నిచ్చట నంతకంటె వివరించి వ్రాయలేదు. కనుక వివరములకు వానినిచూడుడు. మోతాదు $\frac{1}{2}$ చి॥ మొ॥ $\frac{3}{4}$ చి॥ వరకు. తు1కి 1-0-0.

## —* 45 సన్నిపాతభైరవి *—

దీని గుణములు అందరికిని తెలియును. ఇది (1) అల్లపురసముతో పదమూడు సన్నిపాతములు, దోషజ్వరములు, వాతజ్వరములు, శ్లేష్మజ్వరములు, (2) తేనెతో అతిసారము, జ్వరాతిసారము, ఒడలునొప్పులు, కఫవ్యాధులు, శిరోభారము,జలుబు, దగ్గు, వీనిని వెంటనే నశింపజేయును. తేనెతోగాని నీటితోగాని కంటియందు కలికముగ నుపయోగింపవచ్చును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥వరకు. తు 1కి రు 1-8-0.

## —* 46 పైత్యాంతకము. *—

దీనిని (1) అల్లపురసముతో సేవించినచో పైత్యవ్యాధులు,అగ్నిమాంద్యము, మలబంధము, వాంతి, అరుచి, తలతిరుగుట, తలనొప్పి, నోటనీరూరుట, పైత్యాజీర్ణము,(2) జీలకఱ్ఱ లేకధనియాలరసముతో నుపయోగించినచో కడుపులోమంట, వికారముగనుండుట, నోటిపూత, ఎక్కిళ్లు, ఉడుకువ్యాధులు ఇవి వెంటనే నశించును. దీనిని రసములు లేకనే వట్టిదే చప్పరించినను చప్పరించవచ్చును.
మోతాదు $\frac{1}{2}$ చి॥ మొ॥ 1 చి॥ వరకు. తు 1కి రు 1-0-0.

# భస్మలు.

## — * 47 అభ్రకభస్మ * —

అభ్రకము ననేకవిధములగు పరిశోధనలు కావించి శాస్త్రసమ్మతమగుదానినే గ్రహించి శాస్త్రప్రకారముగ తయారుజేసితిమి. దీనిని తయారుచేయుటయందు మాకు ప్రత్యేకానుభవము కలదు. (1) త్రిఫలములు, నేరేడుపప్పు, పసుపు, నేలతాడి, బూరుగబంక వీనియొక్క చూర్ణమును మూడురెట్లుచేర్చి మర్రివూడల కషాయముతో అసాధ్యమగు మధుమేహము, అతిమూత్రము, మూత్రకృచ్ఛ్రము, శుక్లనష్టము (2) రెట్టింపుత్రిఫలాచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, పాడిదగ్గు, ఆయాసము, గుండెదడ, వ్రణములు, భగందరములు, రక్తార్శస్సు, రక్తాతిసారము, (3) మూడురెట్లు సితోపలాదిచూర్ణం, వెన్న వీనితో మేహక్షయ, కాళ్లుచేతులుమంటలు, (4) ఏలకాయలు, ధనియాలు, దాల్చినచెక్క, వీనియొక్క రెట్టింపుచూర్ణముతో పైత్యవ్యాధులు, (5) సమానమగు షడ్గుణము, రెట్టింపు పిల్లిపీచరచూర్ణము, గుమ్మపాలు వీనితో శరీరము కృశించుట, బలహీనత, శరీర మెల్లప్పుడు వెచ్చగనుండుట, వీర్యము పలచగనుండుట, సంభోగశక్తి సరిగలేకుండుట, (6) సుగంధిపాలపొట్టు, చందనపుపొట్టు, పెన్నేరు, అతిమధురము, వీనియొక్క చూర్ణము రెట్టింపు, కలుబందరసము వీనితో జీర్ణించిన సెగవ్యాధులు, మూత్రనాళమందలి మంట చురుకు పోటు, మూత్రము బంధించుట, మూత్రము సన్నముగవచ్చుట, (7) కర్పూరశిలాజితుభస్మ, ఏనుగపల్లేరు, ఆరెపువ్వు, మామిడిటెంకలోనిపప్పు, వీనిచూర్ణము రెట్టింపు, బియ్యపుకడుగు వీనితో సమస్తప్రదరములు, యోనిదోషములు, గర్భాశయదోషములు, (8) నాలుగురెట్లు సరస్వతీయోగచూర్ణము, పంచదార వీనితో ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, భ్రమ, జ్ఞాపకశక్తి సరిగలేకుండుట, స్వరదోషములు, (9) వరిపేలాలు, పత్తిగింజలలోని పప్పు, వీనిచూర్ణము రెట్టింపు, తేనె వీనితో సమస్తఛర్దులు, ఎక్కిళ్లు, గర్భస్రావములు, (10) మూడురెట్లు త్రిఫలాచూర్ణముతో దీర్ఘకాలమునుండి యున్న జిగట (బంక) విరేచనములు, రక్తవిరేచనములు, విరేచనముతో రక్తము లేక జిగురుపడుట, వేడివలన కలిగిన మలబంధము వీనిని నిశ్చయముగ హరించును. అభ్రకము యోగవాహి కావున సమశీతముగ పనిచేయుచు వాతపిత్తశ్లేష్మములవలన కలిగిన వ్యాధుల నన్నిటిని నశింపజేయుననుటలో నెంతమాత్రము నతిశయోక్తి లేదు. శరీరమునకు ఇంద్రియములకు బలమునిచ్చును. కామవృద్ధిని చేయును. వంధ్యాదోషములను పోగొట్టును. శరీరకాంతిని కలిగించును. ఆయుష్షును వృద్ధిపరచును. ఈ దుకువలనకలిగిన సమస్తవ్యాధులయందును అమోఘముగ పనిచేయును. కాని లోకమందు కలుగువ్యాధులలో సగమువ్యాధుల నిది నశింపజేయు సామర్థ్యమును కలిగియున్నది.

మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి 4-0-0.

## — * 48 ఖడ్గలోహభస్మ * —

దీనిని ఉక్కులోహ లేక లోహభస్మయనికూడ యందురు. దీనిని బహు

వ్యయప్రయాసలకు లోనై శాస్త్రప్రకారము తయారుచేసితిమి. మిక్కిలి తీవ్రముగ చురుకుగ పనిచేయును. (1) ఉసిరికపప్పు శుంఠి వీనియొక్క రెట్టింపుచూర్ణముతో పాండువు, అజీర్ణము, తిమ్మెర్లు, కామిర్లు, కుంభకామిల, (2) రెట్టింపు త్రికటు లేక సితోపలాదిచూర్ణముతో నంజు, జీర్ణజ్వరము, క్షయ, కాసశ్వాసలు, వాతవ్యాధులు, అతిసారము, (3) త్రికటుకములు, పంచలవణములు, వీనియొక్క మూడు రెట్ల చూర్ణముతో ఉదరవ్యాధులు, ప్లీహావ్యాధులు, యకృద్వ్యాధులు, శూలలు, (4) తేనెతో శ్లేష్మవ్యాధులు, ఋతుశూలలు, మైల సరిగ వెడలకుండుట, శరీరము లావుపారుట వీనిని వెంటనే హరింపజేయును. రక్తవృద్ధిని శరీరపుష్టిని చేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

—* 49 కాంతలోహ భస్మ *—

ఇది బహుసౌమ్యముగ పనిచేయును. గర్భిణీస్త్రీలకుకూడ వాడవచ్చును. (1) రెట్టింపు త్రిఫలా చూర్ణముతో పాండువు, నంజు, ప్రదరములు, (2) రెట్టింపు పిప్పళ్ళచూర్ణముతో అజీర్ణము, దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, (3) తేనెతో చచ్చువాతము మొదలగు సమస్తవాతములు, తిమ్మెర్లు, కామిర్లు, గుండెవ్యాధులు, గర్భిణీస్త్రీలకు కలుగు పాండువ్యాధి ఇవి హరించును. ఇది రక్తశుద్ధిని రక్తవృద్ధిని చేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 3-0-0.

—* 50 మాండూరభస్మ *—

ఇది తీవ్రముగ పనిచేయును. (1) సమానమగు మిరియాలచూర్ణము తేనె వీనితో కాసశ్వాసలు, క్షయ, గుండెవ్యాధులు, ప్లీహావ్యాధులు, యకృద్వ్యాధులు, అరుచి, (2) రెట్టింపు త్రికటుచూర్ణముతో అజీర్ణము, నంజు, తిమ్మెర్లు, ఉదరవ్యాధులు, గుల్మములు, ఋతుశూలలు, శూలలు, పరిణామశూలలు, ఋతురోధము, (3) తేనెతో శ్లేష్మవ్యాధులు, అతిసారము, స్థౌల్యరోగము, జీర్ణజ్వరము ఇవి కడు శీఘ్రముగ హరించును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

—* 51 లోహాభ్రకసిందూరము *—

ఇది (1) లవంగాలు, తాలీసపత్రి, శుంఠి, వీనియొక్క మూడురెట్ల చూర్ణముతో దగ్గు, ఆయాసము, క్షయలు, శ్లేష్మవ్యాధులు, అజీర్ణములు, నంజు, (2) రెట్టింపు చాతుర్జాతకచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, గుండెవ్యాధులు, పైత్యవ్యాధులు, వాంతులు, ఎక్కిళ్ళు, (3) అతిమధురము, ఉసిరికపప్పు, వట్టివేళ్ళు వీనియొక్క మూడురెట్లచూర్ణము, వెన్న వీనితో నోటిపూత, ప్రమేహవ్యాధులు, ప్రదరవ్యాధులు, బలహీనత, కాళ్ళు చేతులు మంటలు, సెగవ్యాధులు, (4) తేనెతో చచ్చువాతము, పక్షవాతము మొదలగు వాతవ్యాధులు, తిమిరవాతము, చర్మవ్యాధులు, రక్తదోషములు, వీనిని నిస్సందేహముగ హరింపజేయును. మేహపాండువు, మేహనంజు మొదలగు మేహప్రధానవ్యాధులయందు మేహప్రకృతికలవారలకు, లోహజాతి వేడిచేయునని తోచినప్పుడు దీనిని కొంతకాలముపయోగించినచో చాలాబాగుగ పని

చేయగలదు. ఇది సగము అభ్రకము, సగము లోహము కలసి పుటములు వేయబడి నదగుటచే తగిన అనుపానములతో సమస్తవ్యాధులను నశింపజేయుననుటలో ఎంత మాత్రము సందేహములేదు. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

## —* 52 సువర్ణభస్మ *—

ఇది శాస్త్రప్రకారముగను, అనుభవపూర్వకముగను చక్కగ భస్మచేయబడి నది. ఇట్టిభస్మ దొరుకుట దుర్లభము. సుమారు వడ్లగింజ మోతాదులోనే అత్యద్భుత ముగా పనిచేయును. (1) వెన్నతో సమస్తక్షయలు, దగ్గు, ఆయాసము, కృశించుట, గుండెవ్యాధులు, (2) తేనెతో నరముల బలహీనత, పాండువు, అజీర్ణము, శ్లేష్మ వ్యాధులు, వాతవ్యాధులు, (3) పంచదారతో పైత్యవ్యాధులు, ప్రదరవ్యాధులు, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము, రక్తపిత్తము, గుండెవ్యాధులు, శరీరము వెచ్చగనుండుట, జీర్ణజ్వరము, శుక్లనష్టము, (4) నేతితో మధుమేహము, అతిమూ త్రము, జీర్ణించిన సెగవ్యాధులు, వీనిని దివ్యముగ నశింపజేయును. వీర్యవృద్ధిని, శరీరపుష్టిని, కామోద్రేకమును, శరీరకాంతిని, ముఖవర్చస్సును, రక్తశుద్ధినిచేయును. ఫలానవ్యాధులను నశింపచేయునని దీని విషయమై వ్రాయ నవసరములేదు. సమస్త వ్యాధులను నశింపజేయును. మోతాదు ⅛ చి॥ మొ॥ ¼ చి॥ వరకు.

తు 1కి రు 45-0-0.

## —* 53 రజతభస్మ *—

ఇది (1) నేలతాడి, మూలగొండివిత్తులు, పిప్పళ్ళు వీనియొక్క చూర్ణము రెట్టింపు, తిప్పసత్తు సమానము, మీగడ వీనితో శుక్లనష్టము, నడుమునొప్పులు, కాళ్ళులాగుట, వీర్యము పలచగనుండుట, శీఘ్రస్ఖలనము, మధుమేహము, అతి మూత్రము, దగ్గు, అయాసము, (2) తుంగగడ్డలు, తానికాయ బెరడు, జీలకఱ్ఱ, వీనియొక్క రెట్టింపుచూర్ణము, మేడిచెక్క కషాయము, వీనితో శ్వేతరక్త ప్రదర ములు, సోమరోగము, నోటిపూత, యోనిదోషములు, రక్తస్రావము, రక్తపిత్తము, ఇరువది ప్రమేహములు, (3) పంచదారతో శరీరము వెచ్చగనుండుట, బలహీనము, తిమ్మిర్లు, గుండెవ్యాధులు, వీనిని నశింపజేయును. పలచనగనుండు శుక్రమును చిక్కపరుచును. శుక్రదోషముచే కలిగిన రుగ్మతల నన్నిటిని నశింపచేయును. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 5-0-0.

## —* 54 ముత్యభస్మ *—

ఇది సర్వోత్కృష్టమైనది. (1) తేనెతో సమస్తక్షయలు, దగ్గు, ఆయాసము ఉరఃక్షతము, గుండెవ్యాధులు, (2) వెన్నతో శుక్లనష్టము, ఇరువది ప్రమేహములు, శ్వేతరక్తప్రదరములు, మధుమేహము, అతిమూత్రము, ఉడుకు, అజీర్ణము, వాంతి, కాళ్లుచేతులు మంటలు, స్వరదోషములు వీనిని హరింపజేయును. దీనిని తాంబూల ముతో నుపయోగింపవచ్చును. వీర్యవృద్ధినిచేయును. ఇదికూడ సువర్ణభస్మవలెనే పని చేయును. మోతాదు ⅛ చి॥ మొ॥ ¼ చి॥ వరకు. తు 1కి రు 40-0-0.

## —* 55 తామ్రభస్మ *—

ఇది బహుపరిశుద్ధముగ తయారుచేయబడినది. (1) తాలీసపత్రి, లవంగాలు, సన్నరాష్ట్రము, వీనియొక్క మూడురెట్లు చూర్ణము, తేనె, వీనితో దగ్గు, ఆయాసము, క్షయలు, గుండెవ్యాధులు, (2) రెట్టింపు పిప్పళ్ళచూర్ణముతో ఉదరవ్యాధులు, గుల్మములు, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, (3) నాలుగురెట్లు త్రికటుచూర్ణముతో అజీర్ణములు, శూలలు, సంజు, తిమ్మెర్లు, శ్లేష్మవ్యాధులు, సమస్తవాతవ్యాధులు, కుష్ఠములు, చర్మవ్యాధులు, (4) మూడురెట్లు త్రిఫలాచూర్ణముతో భగందరములు, వ్రణములు, మూలవ్యాధి, వీనిని కడుశీఘ్రముగ హరింపజేయును. వేడితత్వముల మీదకంటె, శ్లేష్మవాతతత్వములమీదనే చక్కగ పనిచేయును. కుష్టము, బొల్లి మొదలగు కొన్ని వ్యాధులయందు కొందరు దీనిని ప్రధానముగ వాడెదరు. మోతాదు $\frac{1}{8}$ చి॥ మొ॥ $\frac{1}{4}$ చి॥ వరకు. ప్రత్యేకముగ వాడునప్పుడు మోతాదు ఇంతకంటె తగ్గించవలయును. తు 1 కి రు 4-0-0

## —* 56 సీసభస్మ *—

ఇది బహుశ్రమతో తయారుచేయబడినది. (1) నాగకేసరములు, తాలీసపత్రి వీనియొక్క రెట్టింపుచూర్ణము, పటికబెల్లపుచూర్ణము వీనితో దగ్గు, ఆయాసము, అజీర్ణము, (2) రెట్టింపు త్రిజాతచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, శుక్లనష్టము, ప్రదరవ్యాధులు (3) మంజిష్టి, ఎర్రచందనము, జాజికాయ, ఏలకాయలు, రెట్టింపు వీనియొక్క చూర్ణము, వెన్న వీనితో ప్రదరవ్యాధులు, సెగవ్యాధులు, రక్తదోషములు, నోరుదుర్గంధముగనుండుట, పైత్యవ్యాధులు, కాళ్ళుచేతులు మంటలు, ఇవి వెంటనే హరించును. అధికమగు వీర్యవృద్ధి, నరములకు బలమును కలిగించును, సీసభస్మ శరీరమునకు బలమును కలిగించును. బాలవ్యాధులను నశింపచేయునని కొందరు చెప్పెదరు. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు [illegible]-0-0

## —* 57 వంగభస్మ *—

ఇది(1) చందనంపొట్టు, చలువమిరియాలు, అతిమధురము వీనియొక్క రెట్టింపుచూర్ణము, వెన్న వీనితో శుక్లనష్టము, సెగవ్యాధులు, మూత్రనాళమందలి బాధ, పొడిదగ్గు, కాళ్ళుచేతులు మంటలు, కండ్లుమంటలు, (2) సమానముగు అభ్రకభస్మ, మీగడ వీనితో మధుమేహము, బహుమూత్రము, ఇరువది ప్రమేహములు, శ్వేతరక్త ప్రదరములు, శుక్లము నీరువలెనుండుట, బలహీనత, శీఘ్రస్ఖలనము, (3) ఏలకాయలు, జాపత్రి, వీనియొక్క చూర్ణము రెట్టింపు, భస్మకు సమానముగు పచ్చకర్పూరము, వీనితో నోటిదుర్గంధము, అరుచి, నోటిపూత, స్వరభేదములు వీనిని వెంటనే హరించును. ఉడుకును తగ్గించుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది కనుక ఉష్ణవ్యాధులనన్నిటిని నశింపజేయును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

## —* 58 వైక్రాంతభస్మ *—

ఇది (1) పెన్నేరు, నేలములగ, పిల్లిపీచర, వీనియొక్క మూడురెట్లు చూ

ర్ణము, వెన్న వీనితో క్షయలు, శుక్లనష్టము, దగ్గు, ఆయాసము, మధుమేహము, అతి మూత్రము, (2) రెట్టించు చవ్యపుచూర్ణము, తేనె, వీనితో అజీర్ణము, శ్లేష్మవ్యాధులు, గుల్మములు, (3) రెట్టించు మోడిచూర్ణముతో బుతుబద్ధకము, బుతుశూలల, అగ్ని మాంద్యము వీనిని హరింపజేయును. దగ్గులమీదను మేహవ్యాధులమీదను చక్కగ పనిచేయును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

## —* 59 కర్పూర శిలాజతు భస్మ *—

ఇది (1) పంచదారతో కాళ్ళమంటలు, నోటిపూత, నడుమునొప్పులు, శుక్ల నష్టము, మేహవ్యాధులు, (2) కలబందరసముతో సెగవ్యాధులు, మూత్రముపోవునపుడుబాధ, శరీరతాపము, దప్పిక, (3) ద్రాక్షపండ్లరసముతో పైత్యవ్యాధులు, తలనొప్పి, వీనిని వెంటనే నివారింపజేయును. జ్వరలా చలువచేయునందులో నిది శ్రేష్ఠమైనది. కనుక వేడివలన కలిగిన వ్యాధులన్నిటియందును దీనిని వాడవచ్చును. మోతాదు 1 చి॥ మొ॥ $1\frac{1}{2}$ చి॥ వరకు. తు1కి రు 0-6-0.

## —* 60 పగడపుచూరుభస్మ. *—

ఇది (1) తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, అజీర్ణము, (2) వెన్న శుక్లనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, (3) మిరియాలరసముతో శూల, పరిణామశూల, వీనిని ఖండించును. దీనిని తాంబూలముతో కూడ నుపయోగింపవచ్చును. మోతాదు $\frac{1}{8}$ చి॥ మొ॥ $\frac{1}{4}$ చి॥ వరకు. తు 1కి రు 0-8-0.

## —* 61 శంఖభస్మ *—

ఇది (1) శుంఠి లేక వాముడిరసముతో శూల, అజీర్ణము, కడుపుబ్బరము, కడుపునొప్పి, పరిణామశూల, వాంతి, ప్రేవులకదలుట, (2) తేనెతో శ్లేష్మవ్యాధులు, దగ్గు, ఆయాసము, (3) నిమ్మకాయరసముతో పోసినయెడల చెవిలోపోటు, వీనిని వెంటనే హరింపజేయును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 0-6-0

## —* 62 కాసీస సింధూరము. *—

ఇది (1) రెట్టింపుశుంఠిచూర్ణముతో అజీర్ణములు, అజీర్ణవిరేచనములు, కడుపునొప్పి, (2) రెట్టించు మోడిచూర్ణముతో బుతుబద్ధకము, బుతుశూల, (3) తేనెతో పాండువు, కామిల, జీర్ణజ్వరము, వీనిని హరింపజేయును. వేడిచేయకుండ అజీర్ణములను హరింపచేయుటలో నిది మిక్కిలి శ్రేష్ఠమైనది.
మోతాదు $\frac{1}{8}$ చి॥ మొ॥ $\frac{1}{4}$ చి॥ వరకు. తు 1కి 0-8-0.

## —* 63 గవ్వలభస్మ. *—

ఇది (1) రెట్టించు మిరియాలచూర్ణముతో అజీర్ణము, దగ్గు, ఆయాసము, శ్లేష్మప్రకోపము (2) నిమ్మకాయరసముతో కడుపునొప్పి, శూల, (3) తేనెతో అజీర్ణవిరేచనములు, గ్రహణీవిరేచనములు వీనిని వెంటనే హరించును. చెవిలోపోటునకు నిమ్మకాయరసములో కలిపి పోయవచ్చును. మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు.
తు 1కి రు 0-6-0.

### —* 64 హేమమాక్షికభస్మ. *—

ఇది (1) తేనెతో పాండువు, అజీర్ణము, గుండెవ్యాధులు, దగ్గు, ఆయాసము, (2) వెన్నతో శుక్లనష్టము, నోటిపూత, బలహీనత, తిమ్మిర్లు, వీనిని నశింపజేయును. ఇది బంగారముయొక్క గుణములను కలిగియుండునని చెప్పెదరు.

మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 1-8-0.

### —* 65 రసభస్మ. *—

దీనిని (1) నీటితో మెత్తగనూరి మాత్రలుచేసి నీటితో ముద్దగా నూరబడిన శుంఠిచూర్ణముచే నామాత్రలనుకవచమిచ్చి (పైనకప్పి) మ్రింగించినయెడల అజీర్ణములు, అజీర్ణవాతములు, శూలలు, కడుపుబ్బరము, మలబంధము, నీళ్ళవిరేచనములు, అజీర్ణవిరేచనములు, సమస్తమగు వాతవ్యాధులు, శ్లేష్మప్రకోపములు, దగ్గు, ఆయాసము, గుల్మములు, సవాయివ్యాధులు, సవాయిపుండ్లు, ప్లీహావ్యాధులు, యకృద్వ్యాధులు, ఉదరవ్యాధులు, ఋతుబంధములు, ఋతుశూలలు, (2) తేనె లేక ఆముదములో కలిపి యిచ్చినయెడల చంటిపిల్లలకు కలుగు అజీర్ణవిరేచనములు, అజీర్ణము, కడుపుబ్బరము, మలబంధము, ఎగరొప్పు, శ్లేష్మప్రకోపము, దగ్గు, ఆయాసము, జలుబు, ఇవి వెంటనే హరించును. సవాయివ్యాధులనుకూడ హరించును.

మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ 1 చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

### —* 66 గంధక భస్మ *—

ఇది (1) రెట్టింపుత్రిఫలాచూర్ణము, పంచదార, వీనితో అష్టాదశకుష్ఠములు, సవాయివ్యాధులు, చర్మవ్యాధులు, రక్తదోషములు, భగందరములు, మేహవ్రణములు, బొబ్బలు, గ్రంధులు, (2) తమలపాకులరసముతో రసదోషములు, వీనిని వెంటనే హరింపచేయును. రక్తశుద్ధి చేయుటలో కడు శ్రేష్ఠమైనది.

మోతాదు $\frac{1}{4}$ చి॥ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1 కి రు 1-0-0.

## చూర్ణములు.

### —* 67 తాలీసాదిచూర్ణము *—

దీనిని వేడినీటితోగాని, తేనెతోగాని సేవించినయెడల దగ్గు, ఆయాసము, క్షయ, అరుచి, అజీర్ణము, శ్లేష్మప్రకోపము, గుండెవ్యాధులు, మలబంధము, కడుపుబ్బరము, స్వరభేదము, జలుబు మొదలగునవి వెంటనే హరించును. సామాన్యదగ్గులను త్వరలో తగ్గించుటకు నింతటి శ్రేష్ఠమైనమందు వేరొకటిలేదు.

మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు. పా 1కి రు [illegible]-0-0.

### —* 68 సితోపలాదిచూర్ణము *—

దీనిని వేడినీటితోగాని, రెట్టింపు పటికబెల్లపుచూర్ణముతోగాని ఉపయోగించినయెడల పాడిదగ్గు, పాడిఆయాసము, అజీర్ణము, అరుచి, కాళ్ళుచేతులు

మంటలు, అగ్నిమాంద్యము, శ్లేష్మప్రకోపము, నాలిక మొద్దుగనుండుట, స్వరదోషములు, జలుబు మొదలగునవి నశించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు.
పా 1కి రు 6-0-0

## —* 69 భాస్కర లవణచూర్ణము *—

దీనిని వేడినీటితోగాని, తేనెతోగాని, పుల్లనిమజ్జిగతేటతోగాని సేవించినయెడల అజీర్ణము, పుల్లనిత్రేణుపులు, కడుపుబ్బరము, కడుపునొప్పి, అమ్లపిత్తము, అగ్నిమాంద్యము, గుల్మములు, ఉదరములు, శూలలు, అరుచి, గ్రహణివ్యాధులు, గుండెవ్యాధులు, క్రిమివ్యాధులు, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, ఇవి వెంటనే నశించును. వేడిని చేయకుండ అజీర్ణములను హరింపజేయుటలో కడు శ్రేష్ఠమైనది. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు. పా 1కి రు 4-0-0.

## —* 70 హింగ్వష్టక చూర్ణము *—

దీనిని నేతితో ప్రథమకబళమందు పుచ్చుకొనినయెడల అగ్నిదీప్తి కలుగును. వాతవ్యాధులు హరించును. తేనెతో గాని వేడినీటితోగాని సేవించినయెడల సమస్త అజీర్ణములు, కడుపుబ్బరము, త్రేపులరచుట, కడుపునొప్పి, శూల, పరిణామశూల, అజీర్ణవిరేచనములు, అగ్నిమాంద్యము, అరుచి, త్రేణుపులువచ్చుట, ఋతుబంధము, ఋతుశూల, ఇవి నివారించును. కడుపుబ్బరము త్రేపులరచుట మొదలగు లక్షణములుకల వాతాజీర్ణసంబంధమగు వ్యాధులనన్నిటిని నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు. పా 1కి రు 4-0-0.

## —* 71 త్రివృత్ [తెగడ] చూర్ణము *—

దీనిని రెట్టింపు పంచదారకలిపి వేడినీటితో పుచ్చుకొనినయెడల మలబంధము, కడుపుబ్బరము, కడుపునొప్పి, శూల, అజీర్ణము, నోటిపూత, యకృద్వ్యాధులు, ప్లీహవ్యాధులు, గుల్మములు, ఉదరవ్యాధులు, మూలవ్యాధి, నంజు మొదలగు మలబంధప్రధానమగు వ్యాధులయందు అమోఘముగ పనిచేయును. వాంతి, వికారము, నీరసము, విరేచనములు హెచ్చుతగ్గులగుట మొదలగు దుర్లక్షణముల నేమియు కలిగింపక బహు చక్కగ విరేచనములను చేయును. విరేచనకారులలో బహుశ్రేష్ఠమైనదని శాస్త్రమందు చెప్పబడినమాట మిక్కిలి తథ్యమైనది. మలబంధప్రధానమగు వ్యాధులలో ఆయా మందులతో దీనిని అనుపానచూర్ణముగ చేర్చవచ్చును. మోతాదు $\frac{1}{8}$ తు॥ మొ॥ $\frac{1}{4}$ తు॥ వరకు. అరతులముపరకు నిచ్చినయెడల 5-6 విరేచనములను చేయును.
పా 1కి రు 4-0-0.

## —* 72 దాడిమాష్టక చూర్ణము *—

దీనిని నేతితోగాని, పంచదారతోగాని సేవించినయెడల జిగట [బంక] విరేచనములు, రక్తవిరేచనములు, గ్రహణివిరేచనములు, అజీర్ణవిరేచనములు, అరుచి, రక్తాతిసారము, రక్తార్శస్సు మొదలగువాటిని వెంటనే నశింపచేయును.
మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు. పా 1కి రు 4-0-0.

—* 73 సుదర్శనచూర్ణము *—

దీనిని వేడినీటితోగాని, తేనెతోగాని సేవించినయెడల సమస్తమగు జ్వరములు, చలిజ్వరము, తాపజ్వరము, అంతర్గతజ్వరము, సన్నిపాతజ్వరము, అజీర్ణజ్వరము, దప్పిక, శ్లేష్మజ్వరము. అరుచి, రక్తదోషములు, చర్మవ్యాధులు, అగ్నిమాంద్యము, ఇవి వెంటనె నశించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొదలు $\frac{1}{8}$ తు॥ వరకు.

పా 1కి రు 3—0—0.

—* 74 అశ్వగంధాదిచూర్ణము *—

దీనిని పంచదారతోగాని, వెన్నతోగాని, పాలతోగాని, సేవించినయెడల బలహీనత, శుక్లనష్టము, దగ్గు, క్షయ, శుక్లముపలచగనుండుట, శీఘ్రస్ఖలనము, మధుమేహము, అతిమూత్రము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, ఇరువది ప్రమేహములు, ఉరఃక్షతము, ఇవి వెంటనే హరించును. ఇది శరీరపుష్టిని బలమును కలిగించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{8}$ తు॥ వరకు.

పా 1కి 4—0—0

—* 75 త్రిఫలాచూర్ణము. *—

దీనిని వేడినీటితోగాని పంచదారతోగాని వెన్నతోగాని సేవించినయెడల నోటిపూత, శుక్లనష్టము, దగ్గు, మలబంధము, శ్వేతరక్తప్రదరములు, నేత్రవ్యాధుల భగందరము, రక్తస్రావము, రక్తార్శస్సు, బంకవిరేచనములు, ఇరువదిప్రమేహములు వ్రణములు, మొదలగు నసేక వ్యాధులు నశించును. ఇది సుఖవిరేచనమును చేయును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{8}$ తు వరకు.

పా 1కి రు 2-0-0.

—* 76 పుష్యానుగచూర్ణము. *—

దీని బియ్యపుకడుగుతోగాని, తేనెతోగాని, పంచదారతోగాని, సేవించినయెడల సమస్తమగు ప్రదరవ్యాధులు, యోనిదోషములు, రక్తాతిసారము, బంకవిరేచనములు, శుక్లనష్టము, రక్తపిత్తము, గర్భస్రావములు, అతిమూత్రము, రక్తార్శస్సు ఇవి వెంటనేహరించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{8}$ తు॥ వరకు.

పా 1కి రు 5-0-0

—* 77 చందనాదిచూర్ణము. *—

దీనిని పంచదారతోగాని, తేనెతోగాని, బియ్యపుకడుగుతోగాని సేవించినయెడల సమస్తప్రదరములు, రక్తాతిసారము, యోనిదోషములు, శుక్లనష్టము, ప్రమేహములు, కాళ్ళుచేతులుమంటలు, సెగవ్యాధులు, నోటిపూత, రక్తపిత్తము, పొడిదగ్గు, రక్తార్శస్సు, ఇవి వెంటనేహరించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ $\frac{1}{8}$ వరకు.

పా 1కి రు 4-0-0.

—* 78 జాతీఫలాదిచూర్ణము. *—

దీనిని తేనెతోగాని, పంచదారతోగాని, సేవించినయెడల జిగటవిరేచనములు, రక్తవిరేచనములు, గ్రహణి, దగ్గు, శ్వేతరక్తప్రదరములు, నోటిపూత, రక్తా

ర్శస్సు, వాంతి, అరుచి ఇవి వెంటనే నశించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{8}$ తు॥ వరకు. పా 1కి రు 3-0-0.

## —* 79 ఏలాదిచూర్ణము. *—

దీనిని వెన్నతో సేవించినయెడల శరీరతాపము, దప్పిక, ఉడుకువ్యాధులు, క్షయ, దగ్గు, శరీరము వెచ్చగనుండుట, అతిమూత్రము, అరుచి, వాంతి, శుక్లనష్టము, మూత్రదోషములు, ఇవి వెంటనే హరించును. మోతాదు 2 చి॥ మొ॥ 4 చి॥ వరకు.

పా 1కి రు 5-0-0.

## —* 80 గంగాధర చూర్ణము. *—

దీనిని తేనె, బియ్యపుకడుగు, వీనితో నిచ్చినయెడల బంకవిరేచనములు, అతిసారము, రక్తాతిసారము, గ్రహణీవిరేచనములు, అతిమూత్రము, సమస్తమగు ప్రదరములు, శుక్లనష్టము, ఇరువది ప్రమేహములు, రక్తపిత్తము, రక్తార్శస్సు ఇవి వెంటనే హరించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{8}$ తు॥ వరకు. పా 1కి రు 4-0-0

## —* 81 ఆకారకరభాదిచూర్ణము *—

దీనిని వెన్నతో సేవించినయెడల శుక్లనష్టము, అతిమూత్రము, శుక్లము పలచగనుండుట, కాళ్ళులాగుట, నడుమునొప్పులు, శీఘ్రస్ఖలనము, దగ్గు మొదలగువ్యాధులు వెంటనే హరించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు. పా 1కి రు 4-0-0.

## —* 82 మహాద్రాక్షాదిచూర్ణము *—

దీనిని పంచదారతో సేవించినయెడల దగ్గు, ఆయాసము, క్షయ, ప్రమేహము, శ్వేతరక్తప్రదరములు, శుక్లనష్టము, నోటిపూత, పైత్యవ్యాధులు, తాపము, దప్పిక, రక్తపిత్తము, అరోచకము, ఛర్ది, మెదడువ్యాధులు, యోనిదోషములు, వంధ్యాదోషము, రక్తార్శస్సు, మొదలగు వ్యాధులు వెంటనే హరించును. ఇందు అభ్రకము కలయును. మోతాదు తు॥ $\frac{1}{16}$ మొ॥ $\frac{1}{8}$ తు॥ వరకు. పా 1కి రు 6-0-0.

## —* 83 ఫిరంగాదిచూర్ణము *—

దీనిని పంచదారతో గాని వేడినీటితో గాని సేవించినయెడల సవాయివ్యాధులు, అజీర్ణించుటచే కలిగినవ్యాధులు, కుష్ఠములు, చర్మవ్యాధులు, రక్తదోషములు, వాతవ్యాధులు ఇవి వెంటనే నశించును. మోతాదు $\frac{1}{12}$ తు॥ మొ॥ $\frac{1}{8}$ తు॥ వరకు.

పా 1కి 4-0-0.

## —* 84 అవిపత్తికరచూర్ణము *—

దీనిని వేడినీటితో సేవించినయెడల మలబంధము, అజీర్ణము, కడుపుబ్బరము, కడుపునొప్పి, అగ్నిమాంద్యము, అరుచి, ఆమపిత్తము, మూత్రబంధము, అగ్నిమాంద్యమువలన కలిగినవ్యాధులు, శూల, ప్రమేహములు, మొదలగునవి వెంటనే నశించును. సుఖవిరేచనమును చేయును. మోతాదు $\frac{1}{8}$ తు॥ మొ॥ $\frac{1}{4}$ తు॥ వరకు.

పా 1కి 4-0-0.

# మాత్రలు.

## —* 85 వీర్యస్తంభనవటి *—

వీనిని ఆవుపాలతో నుపయోగించిన యెడల శుక్లనష్టము, శుక్లముపలచగనుండుట, శీఘ్రస్ఖలనము, దగ్గు, కాళ్ళులాగుట, నడుమునొప్పులు, మధుమేహము, అతిమూత్రము, వీనిని నశింపచేయును. శుక్రదోషములను పోగొట్టును. శుక్రమును స్తంభింపజేసి సంభోగశక్తిని వృద్ధిపరచును. మోతాదు 1 మాత్ర. మా 50 కి రు 1-0-0

## —* 86 అశోకవటి *—

వీనిని తిప్పతీగవేళ్ళరసముతో నుపయోగించినయెడల శ్వేతప్రదరము, రక్తప్రదరము, యోనిశూల, యోనిస్రావములును, నువ్వులు, మోడి వీనియొక్క కషాయముతో బహిష్టుఅగుటకుపూర్వము సుమారు నాలుగురోజులనుండియు బహిష్టుఅయ్యేవరకు నుపయోగించినయెడల అసాధ్యమైనఋతుశూల, ఋతురక్తము సరిగ వెడలకుండుట, ఋతురక్తము నల్లగవెడలుట, మొదలగునవియు హరించును. ఋతుదోషములను, గర్భాశయదోషములనుహరింపజేయుటలో మిక్కిలిశ్రేష్ఠమైనదిగ చెప్పబడినది. దీనిసేవనచే సంతానప్రాప్తికూడ కలుగును. మోతాదు 1-2మాత్రలు. మా 50కి రు1-8-0.

## —* 87 యోగరాజ గుగ్గులు *—

వీనిని వేడినీటితో నుపయోగించినయెడల సమస్తమగు వాతవ్యాధులు, శుక్లనష్టము, భగందరము, రక్తస్రావము, సవాయివ్యాధులు, సెగవ్యాధులు, వ్రణములు, అతిసారము, రక్తార్శస్సు, గ్రంధులు, ఆమవాతము, అగ్నిమాంద్యము, గుల్మములు, జలుబు, వడలునొప్పులు, కీళ్ళనొప్పులు, ఉదరవ్యాధులు, అతిమూత్రము, మొదలగువానిని హరింపజేయును. రక్తశుద్ధిని చేయును. మోతాదు 1-2 మాత్రలు. మా 50కి రు 0-12-0.

## —* 88 మహాయోగరాజ గుగ్గులు. *—

వీనిని వేడినీటితో నుపయోగించినయెడల యోగరాజగుగ్గులుయొక్క గుణములనే కలిగియుండును. ఇందధికముగ భస్మలు చేరియున్నవి. మిక్కిలి చక్కగపనిచేయును. మరియు మ్రానుపసుపుకషాయముతో మేహములను, గోమూత్రముతో పాండువును, తేనెతో మేదోవృద్ధిని, వేపచెక్క కషాయముతో కుష్ఠమును, తిప్పతీగ కషాయముతో వాతరక్తమును, పిప్పళ్ళకషాయముతో నంజును, శూలను, పాదిరివేళ్ళ కషాయముతో ఎలుకవిషమును, త్రిఫలాకషాయముతో దారుణమైన నేత్రవ్యాధులను, హరింపచేయును. స్త్రీలయొక్క ఆర్తవదోషములను గర్భాశయదోషములను హరించును. మోతాదు 1-2 మాత్రలు. మా 50 కి 2-0-0.

## —* 89 సుఖవిరేచనవటి *—

వీనిని వేడినీటితో నుపయోగించినయెడల గుల్మము, అజీర్ణము, పైత్యవ్యాధులు, ఉదరము, ప్లీహవ్యాధులు, యకృద్వ్యాధులు, అరుచి, అగ్నిమాంద్యము, నంజు, మలబంధము, కడుపుబ్బరము, కడుపునొప్పి, శూల, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు

ఇవి వెంటనే హరించును. ఇవి వికారము, వాంతి మొదలగు దుర్లక్షణముల నేమియు కలిగింపక సుఖవిరేచనమును చేయును. మోతాదు 1-2 మాత్రలు. మా 50 కి రు 0-8-0.

సూచన — నాల్గుమాత్రలను, ఒకేదఫా ఉదయముననే ఉపయోగించినచో సుమారు 5-6 విరేచనములగును. పైత్యప్రకృతికలవారు అల్లపురసముతో పుచ్చుకొనటమంచిది. 5-6 విరేచనములు అయినచో చారు అన్నము మాత్రమే తినవలయును.

## —* 90 సంజీవనీవటి *—

వీనిని చంటిపిల్లలకు కలుగువ్యాధులయందుపయోగింపవలయును. చనుపాలతో అజీర్ణము, కడుపుబ్బరము, విరేచనములగుచుండుట, వాంతులు, జలుబు, జ్వరము, మలబంధము వీనియందును తమలపాకురసముతో దగ్గు, ఎగరొప్పు, ఆయాసము, మొదలగువానియందును ఉపయోగింపవలెను. కాలలోపుపిల్లలకుకూడ వాడవచ్చును. మోతాదు 1-2 మాత్రలు. మా. 50 కి రు 0-12-0.

## —* 91 అగ్నితుండివటి *—

వీనిని వేడినీటితో సేవించినయెడల అజీర్ణము, మలబంధము, గుండెవ్యాధులు, వాతవ్యాధులు, అగ్నిమాంద్యము, హృద్రోగము, వాతశూలలు, మొదలగు వ్యాధులను నశింపజేయును. ఇందు ముషిణిగింజలుకలియును. కావున నిది నరములకు బలమును కలిగించి సమస్తవ్యాధులను నశింపజేయును. మోతాదు 1-2 మాత్రలు. మా. 50 కి రు 0-12-0.

## —* 92 విషూచివటి *—

వీనిని కలరాయందు వాము, మిరియాలు, దాసెనచెక్క, వాయులవంగాలు, మిరపకాయలలోని గింజలు, మోడి, పసుపుకొమ్ములు, ఆవాలు, నాగకేసరాలు, వీనియొక్క కషాయముతో గంటకొకసారి చొప్పున గాని వ్యాధిఉద్ధృతమునుబట్టి అరగంటకొకసారి చొప్పునగాని ఉపయోగించినయెడల తీవ్రదశలోనున్న కలరా వ్యాధికూడ తగ్గును. వ్యాధి తగ్గుచున్నకొలదియు మందును ఆలస్యముగ నుపయోగించుచుండవలయును. ఈ కషాయమందు కొద్దిగ బ్రాందినికూడ కలుపుచున్నయెడల ఇంకను అమోఘముగ పనిచేయును. కలరా ప్రారంభించిన గ్రామమందు ఈకషాయమును పెట్టుకొని సిద్ధముగనుంచుకొని కలరా ప్రారంభించిన వెంటనే ఇచ్చుట ప్రారంభింపవలయును. ఇట్లుచేసినయెడల ప్రతిరోగియు బ్రతుకగలడు.

దాహముగనున్నచో వాముమాడ్చి అందు నీళ్ళనుపోసి వకపొంగురానిచ్చి వడకట్టి అనీటిని ఇచ్చుచుండవలయును.

నాడి నిరసగతినొందుచు కాళ్ళుచేతులు చల్లబడుట ప్రారంభించినయెడల కస్తూరినిగాని కస్తూరిబాగుగకలిసిన మాత్రలనుగాని వాడవలయును.

వ్యాధితగ్గినకొలదియు చిట్టుడుకునీళ్లు, బార్లిజావ, గోధుమజావ మొదలగువానినిచ్చుట ప్రారంభింపవలయును.

కలరా కల గ్రామమందున్నవారు అజీర్ణముచేయు పదార్థములను, ఆపకూరలు మొదలగువానిని తినకూడదు. బాగుగాకాచి చల్లారిననీటినే త్రాగవలయును.

మా మాత్రలు అనేకమందిని రక్షించినవి. కాన ప్రతివారును ముందుగనే తెప్పించుకొనియుంచుకొనుట శ్రేష్ఠము.

వీనిని దానిమ్మచెక్క, కొడిశపాలవిత్తులు, వీనియొక్క కషాయముతో నుపయోగించినయెడల బంకవిరేచనములు, రక్తవిరేచనములు, అతిసారము, అజీర్ణవిరేచనములు మొదలగునవి కూడతగ్గును. మోతాదు 1-2 మాత్రలు. మా 50 కి రు 1-0-0.

## —* 93 చంద్రప్రభావటి *—

వీనిని నేరేడుచెక్క, బూరుగచెక్క, వీనియొక్క కషాయముతో సేవించినయెడల శుక్లనష్టము, ఇరువది ప్రమేహములు, అతిమూత్రము, సెగవ్యాధులు, అశోకపట్టకషాయముతో సేవించినయెడల సమస్తమగు ప్రదరవ్యాధులు, సోమరోగములు, త్రిఫలాకషాయముతో సేవించినయెడల వ్రణములు, భగందరములు, నోటిపూత, అండవృద్ధి, రక్తాతిసారము, దగ్గు, రక్తార్శస్సు, మొదలగునవి వెంటనే నశించును. మోతాదు 1-2 మాత్రలు. మా 50 కి రు 1—4—0.

## —* 94 సూతికామాత్రలు *—

ఇవి బహుశ్రమతో తయారుచేయబడినవి. సూతికాస్త్రీలకు ప్రాణమునిచ్చునవనుటలో సందేహములేదు. ప్రసవమైనదిమొదలు వాడుచుండినయెడల యేవ్యాధిని దరికికూడ చేరనివ్వవు. కాన ప్రసవమైనవెంటనే మామూలుగ వాడుకునే రసకర్పూరము లేక కస్తూరి మొదలగువానిని వాడి ఆసాయంకాలము మొదలు మూడు రోజులవరకు ప్రతిసాయంకాలమునను, పథ్యమునిచ్చురోజు ఉదయమునను, స్నానము చేయించురోజు ఉదయమునను ఒక్కొక్క మాత్రచొప్పున వేడినీటితో నుపయోగింపవలెను. ఇట్లు చేసినచో ఏ వ్యాధియు దరికిచేరదు. మైల సరిగ కాకున్నయెడల పిప్పళ్ళు, మోడి, చవ్యము, శుంఠి, సన్నరాష్ట్రము, వీనియొక్క కషాయముతో నియ్యవలయును. జ్వరము వచ్చుచున్నయెడల వేపఈనెలు, అడ్డసరము, శుంఠి, తిప్పతీగ, నేలవేము వీనియొక్క కషాయముతో నియ్యవలయును. దోషజ్వరములు, సన్నిపాతజ్వరములు, కలరా మొదలగువానియందు కాళ్ళుచేతులు చల్లబడుట, ఆయాసము మొదలగు అపాయలక్షణములు కలిగినప్పుడు జిల్లేడువేరు లేక మునగచెక్క కషాయముతో 2, 3 గంటలకొకసారి చొప్పున వాడవలయును. అధికమగు వేడిని కలిగించును. మోతాదు 1 మాత్ర. మా 5 కి రు 1-0-0.

## —* 95 కస్తూరిమాత్రలు *—

ఇవి చక్కని వేడిమిని కలిగించును. వీనిని వేడినీటితోగాని ఆయారసములతోగాని ఉపయోగించినయెడల అజీర్ణము, అగ్నిమాంద్యము, వాతప్రకోపము, శ్లేష్మప్రకోపము, వాతవ్యాధులు, అతిసారము, కాళ్ళుచేతులుచల్లపడుట, చెమటలు కలుగుట, సూతికావాతము, పక్షవాతము, జ్వరము, సన్నిపాతజ్వరము, జలుబు, దగ్గు, పడిశము, ఒడలునొప్పులు, కడుపుబ్బరము, దోషజ్వరము, మొదలగువానిని నశింపజేయును. వాతమునుబోగొట్టి వేడిమిని కలిగించును. మరియు వీనిని తమలపాకులు లేకతులసి యాకుల రసముతో నుపయోగించినయెడల చంటిపిల్లలకు కలుగు ఎగరొప్పు, డొక్క

తేగరవేయుట, దగ్గు, అజీర్ణవిరేచనములు, అజీర్ణము, జ్వరము, శ్లేష్మప్రకోపము, జలుబు, మాంద్యము, వాతవ్యాధులు, కడుపుబ్బరము, వాంతులు, మొదలగునవి నశించును. కస్తూరి అధికముగ కలసినది. మోతాదు 1, 2 మాత్రలు. మా 100 కి రు 1-0-0.

—* 96 చందనాదివటి *—

వీనిని చలవమిరియాలు, వెలగచెక్క, వట్టివేళ్ళు, వీనియొక్క కషాయముతో నుపయోగించినయెడల సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, శుక్లనష్టము, శ్వేతరక్త ప్రదరములు, మొదలగు వేడివలన కలిగినవ్యాధులు హరించును. సెగవ్యాధులను హరింపచేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. మోతాదు 1 మాత్ర. మా 50 కి రు 1-0-0.

—* 97 చిత్రకాదిమాత్రలు *—

వీనిని శుంఠిరసముతో నుపయోగించినయెడల అజీర్ణము, కడుపుబ్బరము, త్రేనుపులు, ప్రేగులరచుట, ఇవియు వామురసముతో నుపయోగించినయెడల శూల, పరిణామశూల, క్రిమివ్యాధులు, ఇవియు శుంఠి, దాసెనచెక్క వీనియొక్క రసముతో నుపయోగించిన యెడల అతిసారమును వెంటనే నశించును. అజీర్ణ ప్రధానమగు వ్యాధులయందు మిక్కిలి శ్రేష్ఠమైనవి. మోతాదు 1, 2 మాత్రలు. మా 50కి 0-12-0.

—* 98 రజతనవనీతం మాత్రలు. *—

వీనిని వేడినీటితో నుపయోగించినయెడల అతిమూత్రము, నడుమునొప్పులు, దగ్గు, మధుమేహము, అజీర్ణము ఇవి నశించును. చందనాసవముతో నుపయోగించిన యెడల శుక్లనష్టము నశించును. కుమార్యాసవముతో సమస్తమగు ప్రదరవ్యాధులు నశించును. ఇవి వీర్యవృద్ధిని వీర్యస్తంభనమును చేయును. కామోద్రేకమును కలిగించును. సంభోగశక్తిని వృద్ధిపరచును. మోతాదు 1 మాత్ర. మా 25 కి రు 1-0-0.

# ఆసవారిష్టములు.

—* 99 ద్రాక్షారిష్టము *—

దీనిని ¼ మొదలు ½ ఔన్సు మోతాదు చొప్పున సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల బలహీనత, అజీర్ణము, గుండెవ్యాధులు, మలబంధము, దగ్గు, ఆయాసము, క్షయ, శుక్లనష్టము, పైత్యవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వాత వ్యాధులు, అరోచకము, ఉరఃక్షతము, జీర్ణజ్వరము, రక్తపిత్తము, అర్శస్సు మొదలగువానిని నశింపజేయును. రసౌషధములలో పూర్ణచంద్రోదయమువలె ఆసవారిష్టములలో నిది శరీరమునకు బలమును, పుష్టిని, కలిగించుచు సమస్త వ్యాధులను నశింపజేయును.

పా 1 కి రు 1-8-0

—* 100 అశోకారిష్టము. *—

దీనిని ¼ మొదలు ½ ఔన్సు మోతాదుచొప్పున సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల స్త్రీలకు కలుగు ఋతుశూల, శ్వేతరక్తప్రదరములు, నెలసరిగ బహిష్టు కాకుండుట, ఋతురక్తము సరిగ వెడలకుండుట, ఋతురక్తము

ధికముగ వెడలుట, దౌర్గంధ్యస్రావములు, మొదలగు గర్భాశయ వ్యాధులనన్నిటిని నిశ్చయముగ నశింపజేయును. సంతానమును కలిగించును. గర్భాశయమునకు బలమునిచ్చును. పా 1 కి రు 1-8-0.

## —* 101 చందనాసవము. *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సు మోతాదు చొప్పున సమానమగు నీటిలో కలిపి సేవించినయెడల శుక్లనష్టము, కాళ్లుచేతులుమంటలు, సెగవ్యాధులు, అతిమూత్రము, మూత్రకృచ్ఛ్రము, గుండెవ్యాధులు, రక్తపిత్తము మొదలగు వేడివలన కలిగినవ్యాధులనన్నిటిని వెంటనే నశింపజేయును. దీనిని సేవించునప్పుడు వేడిచేయు పదార్థములను భుజింపరాదు. పా 1కి రు 1-4-0.

## —* 102 సారస్వతారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సు మోతాదు చొప్పున అనుపానముతో పుచ్చుకొనినయెడల ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, జ్ఞాపకశక్తి సరిగలేకుండుట, బుద్ధిమాంద్యము, మొదలగు మెదడు సంబంధమగు వ్యాధులన్నియు నశించును. మరియు నిది స్వరదోషములను, శుక్రదోషములను, రజోదోషములను, గుండెవ్యాధులను శుష్కించుటను, మాటలు సరిగరాకుండుటను వారింపచేయును. బుద్ధిసకలతను, శరీరకాంతిని, వీర్యమును, ధైర్యమును, ఆయువును వృద్ధిపొందించును. దీని సేవించునప్పుడు పైత్యమును వేడిని చేయువస్తువులను సేవింపరాదు. పా 1 కి రు 2-8-0.

## —* 103 వాసారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సు మోతాదుచొప్పున సమానములేక రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల దగ్గు, ఆయాసము, క్షయ, రక్తపిత్తము, శ్లేష్మజ్వరము, జలుబు, శ్లేష్మప్రకోపము మొదలగునవి వెంటనే నశించును. శ్లేష్మమును వెంటనే పలచగచేసి తగ్గించును. దీని గుణములు ప్రసిద్ధములు. పా 1 కి రు 1-4-0.

## —* 104 లోహాసవము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి పుచ్చుకొనినయెడల పాండువు, అజీర్ణము, నంజు, ఉదరము, కామిల్ల, తిమ్మెర్లు, గుండెవ్యాధులు, రక్తదోషములు, వాతవ్యాధులు, అతిసారము, దగ్గు, ఆయాసము, గుల్మము, ప్లీహవ్యాధులు మొదలగునవి వెంటనే హరించును. లోహసంబంధమగు భస్మలుగాని మన్నెఔషధములుగాని వేడిచేసి పనిచేయనప్పుడు దీని నుపయోగించినచో బహుచక్కగ పనిచేయును. గర్భిణీస్త్రీలకుకూడ వాడవచ్చును. పా 1 కి రు 1-8-0.

## —* 105 అమృతారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల జీర్ణజ్వరము, పురాణజ్వరము, విషమజ్వరము, సన్నిపాతజ్వరము, సూతికాజ్వరము, మసూరి (మసూచిక) జ్వరము, వాతజ్వరము, శ్లేష్మజ్వరము మొదలగు సమస్తజ్వరములు హరించును. ఇది రక్తశుద్ధిని, ఆకలికలిగించును. పా 1 కి రు 1-8-0.



## —* 106 కుటజారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల అతిసారము, గ్రహణి, జిగటవిరేచనములు, రక్తముపడుట, రక్తపిత్తము, రక్తార్శస్సు, జ్వరములు, ఇవి వెంటనే హరించును. ఇది ఆకలిని పుట్టించును. పా 1 కి రు 1-8-0.

## —* 107 బబ్బూలారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల దగ్గు, క్షయ, ఆయాసము, నోటిపూత, శుక్లనష్టము, అతిసారము, జిగట విరేచనములు, రక్తముపడుట, శ్వేతరక్తప్రదరములు, కుష్ఠము, ప్రమేహవ్యాధులు మొదలగునవి వెంటనే హరించును. పా 1 కి 1-4-0.

## —* 108 అశ్వగంధారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల బలహీనత, శుక్లనష్టము, దగ్గు, క్షయ, గుండెవ్యాధులు, కృశించుట, వాతవ్యాధులు, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము మొదలగునవి వెంటనేహరించును. నరములకు బలమును శరీరమునకు పుష్టిని కలిగించును. పా 1కి 1—8—0.

## —* 109 అహిఫేనాసవము *—

దీనిని 10 చుక్కలు మొదలు 30 చుక్కలువరకు ¼ మొ॥ 1 ఔన్సునీటిలో కలిపి సేవించినయెడల జిగటవిరేచనములు, అతిసారము, రక్తముపడుట, విషూచి (కలరా), పొడిదగ్గు, శుక్లనష్టము, పొడిఆయాసము, గ్రహణి మొదలగునవి వెంటనే నశించును. ఇందు నల్లమందు కలియును. కనుక వెంటనే పనిచేయును.

పా 1 కి రు 8—0—0.

## —* 110 కర్పూరాసవము *—

దీనిని 1/8 మొ॥ ¼ ఔన్సువరకు ¼ మొ॥ 1 ఔన్సునీటిలో కలిపి సేవించినయెడల విషూచి (కలరా), నీళ్ళవిరేచనములు, అజీర్ణవిరేచనములు, దగ్గు, ఆయాసము, గ్రహణీవిరేచనములు మొదలగునవి వెంటనే హరించును. పా 1కి రు 6—0—0.

## —* 111 అర్జునారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల గుండెసంబంధమగువ్యాధులన్నియునశించును. గుండెకుబలముకలుగును. పుప్ఫుస(లంగ్సు)సంబంధమగువ్యాధులనన్నిటినికూడ నశింపచేయును. కఫమును వెంటనే కరిగించినశింపచేయును. గుండెవ్యాధులకు శ్రేష్ఠమైనదని అందరికిని తెలియును. పా 1 కి రు 1-8-0.

## —* 112 కనకాసవము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల దగ్గు, ఆయాసము, క్షయ, రక్తపిత్తము, ఉరఃక్షతము మొదలగునవి నశించును. ఉమ్మెత్త అధికముగకలయుటచే శ్లేష్మజాతిమీద వెంటనేపనిచేయును. పా 1కి రు 1-4-0.

### —* 113 సారిబాద్యాసవము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల రక్తదోషముచే కలిగిన వ్యాధులన్నియు నశించును. జీర్ణించిన సవాయివ్యాధులు కూడ నశించును. మరియు శుక్లనష్టము, శరీరతాపము మొదలగు వేడివలన కలిగిన వ్యాధులన్నియు నశించును. చర్మవ్యాధులు, ప్రమేహములు, వాతరక్తము, సెగవ్యాధులు, ప్రదరములు, భగందరము, మొదలగు వ్యాధులుకూడ హరించును. పౌ 1కి రు 1-8-0

### —* 114 అభయారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల మలబంధమును పోగొట్టి సుఖవిరేచనమును చేయును. దగ్గు, ఆయాసము, మూలవ్యాధి, భగందరము, ఉదరము, నంజు, గుల్మము, మొదలగునవి నశించును. మలబంధముకలవారికి ఆయుర్ద్రావకములలో కలిపి యివ్వవచ్చును. పౌ 1కి రు 1-4-0.

### —* 115 బలారిష్టము. *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల వాతవ్యాధులు, దగ్గు, క్షయ, బలహీనత, శుక్లనష్టము మొదలగునవి వెంటనే నశించును. శరీరమునకు బలమును, పుష్టిని కలిగించును. పౌ 1కి రు 1-4-0.

## ఘృతములు.

### —* 116 బ్రాహ్మీ [సారస్వత] ఘృతము. *—

మోతాదు ¼ మొ॥ ½ తు॥ వరకు. దీనిని ఆవుపాలతోగాని, కేవలముగాని సేవించినయెడల ఉన్మాదము, బుద్ధిమందముగనుండుట, అపస్మారము, మూర్ఛ, జ్ఞాపకశక్తిసరిగలేకుండుట, మొదలగు మెదడువ్యాధులును, పైత్యసంబంధమగువ్యాధులును, వేడిసంబంధమగువ్యాధులును నశించును. దీనిసేవనచే ధారణశక్తియు, శరీరకాంతియు, వాగ్వృద్ధియు, కిన్నరకంఠస్వరమును, బలమును, శుక్రబలమును కలుగును. త్వరలో మాటలురానిపిల్లలకు దీనినుపయోగించుట మిక్కిలి శ్రేష్ఠము. ఔ॥4 కి రు1-8-0

### —* 117 పంచతిక్తగుగ్గులుఘృతము *—

మోతాదు ¼ మొ॥ ½ తు॥వరకు.త్రిఫలాకషాయముతోగాని, కేవలముగాని సేవించినయెడల రక్తదోషములు, అష్టాదశకుష్టములు, జీర్ణించినసవాయివ్యాధులు, జీర్ణజ్వరము, భగందరము, గండమాల, నాడీవ్రణము, ప్రమేహములు, విద్రధి, వాతరక్తము, వ్రణములు, కంఠవ్యాధులు మొదలగునవి నశించును. ఔ॥ 4-కి రు 1-4-0.

### —* 118 అశోకఘృతము. *—

మోతాదు ¼ మొ॥ ½ తు॥ వరకు. దీనిని కేవలము సేవించినయెడల శ్వేతరక్తప్రదరములు, ఋతుశూల, ఋతురక్తముసరిగ వెడలకుండుట, యోనిస్రావములు, యోనిశూల, వంధ్యాదోషములు, రక్తగుల్మము,మొదలగునవి హరించును. ఇది గర్భాశయవ్యాధులను నశింపచేసి సత్సంతానమును కలిగించును. ఔ॥ 4 కి రు 1-8-0.

—* 119 పంచగవ్యఘృతము *—

మోతాదు ¼ మొ॥ ½ తు॥ వరకు. దీనిని పంచదారతో కలిపి సేవించినయెడల అపస్మారము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగునవి నశించును. డా॥4కి రు1-4-0.

—* 120 కల్యాణఘృతము *—

మోతాదు ¼ మొ॥ ½ తు॥ వరకు. ఆవుపాలతో సేవించినయెడల గర్భాశయ దోషములును, ఋతుదోషములును నశించి సత్సంతానము కలుగును. గర్భస్రావము, ప్రదరములు నశించును. దివ్యమైన పుత్రులు కలుగుదురు. డా॥ 4 కి రు 1-4-0.

# తైలములు

## తైలములను సామాన్యముగ నుపయోగించు పద్ధతి.

తైలములను బాధకలప్రదేశమందు రోజుకు 2-3 సార్లు 10-15 నిమిషముల చొప్పున అవసరమైనంత తైలమును మర్దనచేయుచు వెంటనే ఆయా కషాయములతో గాని విశేషము వేడిగలేని వేడినీటితో గాని కడగవలయును. కొన్ని వ్యాధులయందు ఆ చమురు ఇముడుచుయుండునట్లు యుండుటకు గాను కడగకుండకూడ నుంచవచ్చును. ఆమవాతము మొదలగు కొన్ని వ్యాధులయందు విశేషము నొక్కి మర్దించినయెడల పచ్చిచేసి వ్యాధి యెక్కువకావచ్చును. అట్టివ్యాధులయందు సామాన్యముగ పూయుటయే శ్రేష్ఠము. కొన్నివ్యాధులయందు తైలములను మర్దనచేయుచు లోనికి ఆయా మందులు పుచ్చుకొనవలసి యుండును. తైలమును లోనకు సేవించుపద్ధతి విశేష సాంప్రదాయముగ లేదు.

—* 121 అర్కక్షీరతైలము *—

దీనిని మర్దించుటచే పక్షవాతము, అర్దితవాతము, సంధివాతము, కంపవాతము, సర్వాంగవాతము, మొదలగు ఎనుబదివాతములును హరించును. డా 4కి రు 0-12-0.

—* 122 చందనాదితైలము *—

దీనిని ఊపిరితిత్తులకును శరీరమంతకును పూసినయెడల రాజయక్ష్మ, దగ్గు, ఆయాసము, కృశించుట, శరీరమెల్లప్పుడు వెచ్చగనుండుట, శరీరతాపము మొదలగునవి నశించును. మరియు రక్తదోషములును, చర్మదోషములును, కృత్రిమవిషమును నశించును. చర్మమునకు మృదుత్వమును, శరీరమునకు కాంతియు, బలమును, కలుగును. శిరస్సున మర్దించినయెడల నేత్రవ్యాధులును, శిరోవ్యాధులును, మెదడువ్యాధులును నశించును. వెంట్రుకలు మృదుత్వమును నలుపును కలిగి పచ్చువలె నతిదీర్ఘముగ పెరుగును. కాళ్ళకుమర్దించినయెడల కాళ్ళమంటలు నశించును. డా 4కి రు 1-8-0

—* 123 నారాయణతైలము *—

దీనిని మర్దించుటచే ధనుర్వాతము, సర్వాంగవాతము, కంపవాతము, అర్దితవాతము, పక్షవాతము, హనుస్తంభము, మన్యాస్తంభము, పంగువాతము, కుబ్జవాతము, అపబాహుకము మొదలగు వాతవ్యాధులన్నియు నశించును. పశువులకు కలుగు

వ్యాధులయందుకూడ నుపయోగింపవచ్చును. ఇది అంత్రవృద్ధి, చెముడు, వంధ్యాత్వము, మొదలగు వానినికూడ నశింపచేయును. మేహవాతసంబంధమగు వ్యాధులనన్నిటిని నశింపచేయుటలో కడుశ్రేష్ఠమైనది. రాజతైలము. డ్రా 4కి రు 1-4-0.

## —* 124 మాషతైలము *—

దీనిని మర్దించుటచే సంధివాతము, అపబాహుకవాతము, అనువాతము, చేతులు వణుకు, అర్దితవాతము, పక్షవాతము, శిరస్స్రవణము, మన్యాస్తంభము మొదలగునవి నశించును. మరియు నిది చెవిలోపోటు, వినపడకుండుట, తిమ్మిర్లు, మొదలగువానిని కూడ హరింపచేయును. మేహముచేగాని వాతముచేగాని మేహవాతములచేగాని, కలిగిన వ్యాధులను నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. డ్రా 4కి రు 1-0-0.

## —* 125 పిండతైలము *—

దీనిని పూయుటచే వాతరక్తము, కుష్ఠములు, చర్మవ్యాధులు, మేహవాతనొప్పులు, కాళ్ళుచేతులు మంట, వ్రణములు, వాతవ్యాధులు, కీళ్ళనొప్పులు, మొదలగునవి నశించును. చర్మమునకు మృదుత్వము కలుగును. డ్రా 4కి రు 1-0-0.

## —* 126 భృంగామలకతైలము *—

దీనిని శిరస్సున మర్దించినయెడల తలనొప్పి, తలపోటు, మొదలగు శిరోవ్యాధులును, కండ్లమంటలు, కండ్లుఎరుపులు, కండ్లనుండి నీరుకారుట, కండ్లు కాయుట, కండ్లుసరిగ కనబడకుండుట మొదలగు నేత్రవ్యాధులును, చెవిలోపోటు చెవిలోనుండి చీముకారుట మొదలగు కర్ణవ్యాధులును, ఉన్మాదము, మూర్ఛ, అపస్మారము, జ్ఞాపకశక్తి సరిగలేకుండుట, మొదలగు మెదడువ్యాధులును,హరించును. కాళ్ళకు మర్దించినయెడల కాళ్లమంటలు తగ్గును. వెంట్రుకలను నల్లగజేసి పెరుగునట్లు చేయును. దీనిని ప్రతిదినము నుపయోగించుచు 5-6 రోజులకొకసారి కుంకుడుకాయతో తలరుద్దుకొనుచు అభ్యంగనము చేయుట మంచిది. డ్రా 4కి రు 1-2-0.

## —* 127 విషముష్టితైలము *—

దీని మర్దనచే పక్షవాతము, సర్వాంగవాతము, ధనుర్వాతము మొదలగు వాతవ్యాధులు వెంటనే నశించును. దీనిని పూసినచో సుప్తివాతము,కుష్ఠములు, వాతరక్తము, చర్మవ్యాధులు, నశించును. చర్మమునకు మృదుత్వమును,కాంతియు కలుగును. ఇందు ముషిణిగింజలు కలయుటచే వాతవ్యాధులను హరింపచేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. డ్రా 4 కి రు 1-0-0.

## —* 128 అమృతామలకతైలము *—

ఇది భృంగామలక తైలముయొక్క గుణములనే కలిగియుండును. కాని ఇందు చలవచేయు వస్తువులధికముగ చేరును. కాన దానికంటె నధికమగు చలవనుచేయుచు బహు చక్కగ పనిచేయును. డ్రా 4 కి రు 0—12—0.

## —* 129 బలాతైలము *—

దీనిని మర్దించుటచే సంధివాతము, కంపవాతము, పక్షవాతము, ఆక్షేపకవా

తము, చచ్చువాతము, మొదలగు వాతవ్యాధులన్నియు నశించును. దీనిని లోపలకు సేవించినయెడల సూతికా వాతము, అంత్రవృద్ధి, ధాతుక్షీణము, వంధ్యాత్వము, శుక్ర దోషములు, ఎక్కిళ్లు, దగ్గుట, మొదలగునవి నశించునని చెప్పబడినది. బల (ముత్తవ పులగము) వాతమును హరించుటలోను పుష్టిని కలిగించుటలోను మిక్కిలి శ్రేష్ఠమయినది. వాతవ్యాధులందు శాస్త్రకారులు దీనినితరుచుగ చెప్పిరి. పా 4కి రు1-0-0.

### —* 180 రాస్నాదితైలము *—

దీనిని మర్దించినచో ఆమవాతము, పక్షవాతము, సంధివాతము, మన్యాస్తంభము, ఆక్షేపకవాతము, కంపవాతము, అపబాహుకవాతము, మొదలగు వాతవ్యాధులు హరించును. రాస్నవాతహరములలో శ్రేష్ఠమైనది. పా 4 కి రు 0-12-0.

## లేహములు

### —* 181 త్రివృల్లేహము. *—

దీనిని రాత్రి పరుండునప్పుడు గాని ఉదయముననే గాని అరతులము (సుమారు గచ్చకాయంత) పుచ్చుకొని కొద్దిగ వేడినీళ్ళు త్రాగినయెడల మలబంధమును పోగొట్టి సుఖవిరేచనమును జేయును. అందుచే మూలవ్యాధి, అజీర్ణము, కడుపునొప్పి, అరుచి, పైత్యవ్యాధులు, నంజు, శూల, రక్తదోషములు, గుల్మము, ఉదరవ్యాధులు, యకృద్వ్యాధులు, ప్లీహవ్యాధులు, కడుపుబ్బరము, మొదలగువ్యాధులను వెంటనే హరించును. ఉదయముననే 1-1½ తులము పుచ్చుకొనినయెడల 4 మొ॥ 8 వరకు విరేచనములు బాగుగనగును. కడుపులో త్రిప్పుట, వాంతి మొదలగు దుర్లక్షణములు నేమియు కలిగింపదు. పా 1 కి రు 2-0-0

### —* 182 పాలసుగంధిలేహము *—

దీనిని ½ మొ॥ ¾ తు॥ వరకు తిప్పతీగ కషాయముతో గాని కేవలముగ గాని సేవించినయెడల రక్తదోషములు, శుక్లనష్టము, మేహవ్యాధులు, పైత్యవ్యాధులు, కుష్టవ్యాధులు, వ్రణములు, చర్మవ్యాధులు, మొదలగునవి నిశ్చయముగ నశించును. వేడివలనకలిగిన దగ్గు మొదలగువానినికూడ నశింపచేయును. ఉడుకును తగ్గించుటకును రక్తశుద్ధిని చేయుటకును మిక్కిలి శ్రేష్ఠమయినది. పా 1 కి రు 2-0-0.

### —* 183 ఆమలకలేహము *—

దీనిని ½ మొ॥ ¾ తు॥ వరకు జీలకర్ర, ధనియాలు, మొదలగువానియొక్క కషాయముతో గాని, కేవలముగ గాని, సేవించినయెడల తలతిరుగుట, వళ్ళుతిరుగుట, పసరువాంతియగుట, నోటిపూత, నోరు అసహ్యముగనుండుట మొదలగు పైత్యవ్యాధులును దగ్గు మొదలగు వ్యాధులును వెంటనే హరించును. పా 1 కి రు 2-0-0.

### —* 184 మదనకామేశ్వరలేహము *—

దీనిని ¼ మొ॥ ½ తు॥ వరకు ఆవుపాలతో సేవించినయెడల శరీరము కాంతి నందుట, శీఘ్రస్ఖలనము, శుక్లనష్టము, కడుపునొప్పుల, కాళ్ళలాగుట, రక్తపిత్త,

దగ్గు, ఆయాసము, ప్రదరవ్యాధులు మొదలగునవి వెంటనే హరించును. ఇది శుక్రదోషములన్నిటిని నశింపజేసి శుక్రమును వృద్ధిపరచును. మన్మథోద్రేకమును, మనస్సునకు ఉత్సాహమును కలిగించును. సంభోగశక్తిని వృద్ధిపరచును. వౌ 1 కి రు 8-0-0

## —* 135 అశ్వగంధాదిలేహము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{3}{4}$ తు॥ వరకు ఆవుపాలతో సేవించినయెడల బలహీనత, శుక్లనష్టము, క్షయ, దగ్గు, ఉత్థానశక్తిసరిగలేకుండుట, ధాతుక్షయ, వాతవ్యాధులు మొదలగునవివెంటనేహరించును. శుక్రదోషములను పోగొట్టి శుక్రవృద్ధిని చేయును. శుక్రమును చిక్కపరచును. అధికమగు కామోద్రేకమును కలిగించును. వౌ 1కి రు 3-0-0

## —* 136 కూష్మాండలేహము *—

దీనిని $\frac{1}{2}$ మొ॥ $\frac{3}{4}$ తు॥ వరకు కేవలము సేవించినయెడల దగ్గు, ఆయాసము, ఎక్కిళ్లు, శుక్లనష్టము, రక్తపిత్తము, శరీరమువెచ్చగనుండుట, శరీరము శుష్కించుట, శ్వేతరక్తప్రదరములు, ఉరఃక్షతము, క్షతక్షయ, వీనిని నశింపచేయును. బుద్ధికుశలత, జ్ఞాపకశక్తి, గుండెకుబలము, వీనిని కలిగించును. ఉడుకువ్యాధులను తగ్గించుటలో మిక్కిలి శ్రేష్టమైనది. బాలురకుకలుగు ఉడుకువ్యాధులయందు కూడచక్కగపనిజేయును. శరీరపుష్టిని కలిగించును. వౌ 1కి రు 2-0-0.

## —* 137 వాసావలేహము *—

దీనిని $\frac{1}{2}$ మొ॥ $\frac{3}{4}$ తు॥ వరకు తేనెతోగాని, కేవలముగాని, సేవించినయెడల దగ్గు, ఆయాసము, క్షయ, రక్తపిత్తము, శ్లేష్మప్రకోపము మొదలగు వ్యాధులు వెంటనే నశించును. శ్లేష్మమును తగ్గించి ఆ యా వ్యాధులను నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్టమైనది. వౌ 1కి రు 2-0-0.

## —* 138 ఫిరంగాదిలేహము *—

దీనిని $\frac{1}{2}$ మొ॥ $\frac{3}{4}$ తు॥ వరకు కేవలము సేవించినయెడల సవాయివ్యాధులు జీర్ణించుటచే కలిగినపోడలు, మచ్చలు, ముఖనాసిక, కొరుకు, దద్దుర్లు, బొబ్బలు, కీళ్ళనొప్పులు, మొదలగునవి వెంటనేహరించును. మరియు సమస్తమగు వాతవ్యాధులు, కుష్టములు, చర్మదోషములు, వ్రణములు, భగందరములు, మొదలగునవికూడ హరించును. ఇదికొద్దిగ వేడిచేయుచు పనిచేయును. దీని సేవించునపుడు పెరుగు, మజ్జిగ, నెయ్యి వీనిని తెత్వానుకూలముగ నధికముగ సేవించవలయును. వౌ 1కి రు 3-0-0.

## —* 139 చ్యవనప్రాశలేహము *—

దీనిగుణము లందరికిని తెలిసినవే. కాన విశేషించి వ్రాయనవసరము లేదు. దీనిని $\frac{1}{2}$ మొ॥ $\frac{3}{4}$ తు॥ వరకు ఆవుపాలతో సేవించినయెడల క్షయ, దగ్గు, ఆయాసము, ఉరఃక్షతము, స్వరభేదము, ఊపిరితిత్తులసంబంధమగువ్యాధులు, గుండెవ్యాధులు, శుక్రదోషములు, మొదలగునవి హరించును. బాలురకును, వృద్ధులకును, కూడ శరీరపుష్టిని కలిగించును. బుద్ధికుశలత, జ్ఞాపకశక్తి, శరీరకాంతి, ఆరోగ్యము,

ఆయువు, ఇంద్రియబలము, సంభోగకాంతి, జాఠరదీప్తి, బలము, వీటిని కలిగించును. దూరదేశములనుండి యనేకమూలికలను తెప్పించి శాస్త్రప్రకారముగ తయారుచేసితిమి. అద్వితీయముగ పనిచేయును. పా 1కి రు 3-0-0.

# ఇతరౌషధములు.

## —* 140 గంధకపుష్పము *—

దీనిని ½ మొ॥ 1 చిన్నం వరకు జీలకఱ్ఱ లేక ధనియాలరసముతో గాని పంచదారతో గాని సేవించినయెడల సవాయివ్యాధులు జీర్ణించుటచే కలిగిన బొబ్బలు, మచ్చలు, పుండ్లు. ముఖనాసిక, చేతులునల్లగనుండుట, అంగముమీదిపుండ్లు, మొదలగునవియు అష్టాదశకుష్టములు, భగందరములు, సమస్తమగురక్తదోషములు, సమస్తమగు చర్మదోషములు, మొదలగునవియు నిశ్చయముగ నశించును. ఇందు ఆముదము కలయుటచే సుఖవిరేచనమునుచేయుచు పనిచేయును. తు 1కి రు0-8-0

## —* 141 భావనకేరకాయ *—

దీనిని ½ మొ॥ ¾ తు॥ వరకు నోటిలోనుంచుకొని చప్పరించుచు రసమును మ్రింగినయెడల అజీర్ణము, మలబంధము, అరుచి, నోటనీరూరుట, సమస్తమగుపైత్యవ్యాధులు, దగ్గు, ఆయాసము, సమస్తమగు శ్లేష్మవ్యాధులు, అగ్నిమాంద్యము, గుల్మము, గుండెలలోమంట, వికారముగనుండుట, నోరుఅసహ్యముగనుండుట, తలతిరుగుట మొదలగువ్యాధులు నశించును. శేరు 1కి రు 1-0-0

## —* 142 మాదీఫలరసాయనము *—

దీనిని ½ మొ॥ 1 తు॥వరకు కేవలముగాని రెట్టింపునీటిలో కలిపిగాని సేవించినయెడల నోటిపూత, అజీర్ణము, అరుచి, మలబంధము, వికారముగనుండుట, పుల్లనిత్రేనుపులు, వాంతి, సమస్తమగు పైత్యవ్యాధులు, కడుపులోమంట, తలతిరుగుట, దద్దుర్లు, తాపము, దప్పిక, రక్తదోషములు, కామెర్లు, నోటనీరూరుట, నోరుఅసహ్యముగనుండుట, ఎక్కిళ్లు, ఉడుకు మొదలగువ్యాధులు హరించును. గర్భిణీ స్త్రీలకు కలుగు నోటనీరూరుట, అజీర్ణము, వాంతి, మొదలగుసమస్తమగువ్యాధులను హరింపజేయును. దీనిని తరుచు నుపయోగించినయెడల సుఖప్రసవమును ఆరోగ్యసంతానమును కలుగును. కాన మొదటినుండి వాడుట శ్రేష్టము. జా 4 కి రు 0-12-0.

## —* 143 కర్ణామృతం. *—

దీని 4-5చుక్కలు చొప్పున రోజుకు 2-3 సార్లు చెవిలోపోసినయెడల చెవిపోటు, హోరుగనుండుట, చీముకారుట, చెముడు, కర్ణస్రావము, దిబ్బడివేయుట, గురగురలాడుట మొదలగు కర్ణవ్యాధులన్నియు నశించును. జా 1కి రు 0-4-0.

## —* 144 నేత్రబిందు. *—

దీనిని 3-4 చుక్కలు చొప్పున రోజుకు 2-3 సార్లు కంటిలో వేసినయెడల కండ్లు ఎఱ్ఱగనుండుట, మంట, పుసికట్టుట, అంటుకొనుట, నీళ్లుకారుట, సరిగకనబడకుండుట మొదలగు నేత్రవ్యాధులు నశించును. జా 1కి రు 0-4-0.

## —* 145 గంధకరసాయనము *—

దీని వక మాత్ర చొప్పున కేవలము సేవించినయెడల అష్టాదశకుష్టములు, జీర్ణించిన సవాయివ్యాధులు, భగందరము, పుండ్లు, చర్మదోషములు, కొరుకు, దురద, విషదోషము, కరిమేహము, మేహవ్యాధులచే శరీరము నల్లపడుట, మొదలగు వ్యాధులయందు అమోఘముగ పనిచేయును. రక్తశుద్ధిని చేయు మందులలో నద్వితీయమైనది. బహుపరిశుభ్రముగ తయారుచేయబడినది. తిప్పతీగ కషాయముతో గాని సుగంధిపాల కషాయముతో గాని సేవించినయెడల నింకను యమోఘముగ పనిచేయును. పైత్యప్రకృతికలవారు జీలకఱ్ఱ లేక ధనియాలరసముతో పుచ్చుకొనుట మంచిది. దీనిని సేవించునప్పుడు నూనె ఆవ మొదలగు పైత్యమునుచేయు వస్తువులను సేవింపరాదు. 1 తులము 10 మాత్రలగును. తు 2 కి లేక మా 20 కి రు 0-12-0

## —* 146 రసోత్తమాదిలేపము. *—

చర్మవ్యాధులను నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. దీనిని గొబ్బరి నూనెతో గాని బఱ్ఱెవెన్నతో గాని పూసినయెడల తీట, గజ్జి, పుండ్లు, దురద, విసర్పము (చప్పి), పురుపులు, కొరుకువ్యాధి, మొదలగు చర్మవ్యాధులన్నియు నశించును. ప్రారంభదశలోనున్న కుష్ఠముకూడ నశించునని చెప్పవచ్చును. నిమ్మకాం పులుసులో కలిపి పూసినయెడల కొద్దిగ మంటను కాని తామర వెంటనే చిత్రముగ హరించును. ఇందు పాదరసము, గంధకము, మొదలగునవి కలసియుండును. కాన కన్ను, నోరు మొదలగువానికి తగలకుండుట మంచిది. పా 1కి రు 6-0-0.

## —* 147 తిప్పసత్తు *—

మోతాదు ½ మొ॥ 1 చిన్నమువరకు పంచదారతో సేవించినయెడల శరీరతాపము, నోటిపూత, ప్రదరవ్యాధులు, మేహవ్యాధులు, కాళ్లుచేతులు మంట, దగ్గు, పైత్యవ్యాధులు మొదలగునవి హరించును. వంగభస్మను సగము పరిమితిగ కలిపి వెన్నతో సేవించినయెడల శుక్లనష్టమును, అభ్రకభస్మమును సగము పరిమితిగ కలిపి వెన్నతోడ సేవించినయెడల మధుమేహమును, అతిమూత్రమును, సగము పరిమితిగల కాంతలోహమును రెట్టింపు త్రిఫలాచూర్ణమును కలిపి వేడినీటితో సేవించినయెడల జీర్ణజ్వరమును హరించును. తు 1 కి రు 0-6-0

## —* 148 అజమోదార్కము [వామ్‌వాటరు] *—

దీనిని ½ మొ॥ ¾ ఔన్సువరకు సమానమగునీటిలో కలిపి సేవించినయెడల అజీర్ణము, కడుపునొప్పి, శూల, పరిణామశూల, ప్రేగులరచుట, అతిసారము, అజీర్ణవిరేచనములు, వాంతులు, అరుచి, కడుపుబ్బరము, కలరా, అగ్నిమాంద్యము మొదలగువ్యాధులు వెంటనే హరించును. ఔ 24 కి రు 0-8-0

## —* 149 తామ్రమైనము *—

దీనిని ½ మొ॥ 1 చిన్నంవరకు మంజిష్టి, సుగంధిపాలపొట్టు, జీలకఱ్ఱ, వీని యొక్క కషాయముతో సేవించినయెడల, సవాయివ్యాధులుజీర్ణించుటచేకలిగినవ్యా

ధులు, కోరడ, చేతులయందును శరీరమందును మచ్చలు, బొబ్బలు, మొదలగునవి యు, సమస్తమగుకుష్ఠములును, సమస్తమగు చర్మవ్యాధులును, రక్తదోషములును, భగందరములును, వ్రణములును హరించును. కేవలము మాత్రలుగచేసి సేవించినయెడల అజీర్ణము, నంజు, దగ్గు, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, శరీమేహము మొదలగునవి వెంటనే హరించును. అనేక వ్యాధులను రూపుమాపును. తు 1కి రు 0-12-0.

## —* 150 తాలకాదివర్తి *—

దీనిని చనుపాలతోగాని, తేనెతోగాని, అవసరమైనంత అరగదీసి కంటియందుంచినచో కండ్లు పొరలుకమ్ముట, ఎర్రగనుండుట, మంట, నీళ్ళుకారుట, పుసికట్టుట, సరిగ కనపడకుండుట, మొదలగు నేత్రవ్యాధులన్నియు హరించును. దుర్మాంసములను పొరలను కోసివేయును. కణికలు 12 కి రు 0-12-0.

## —* 151 బాలసుధ (రిజిష్టర్డు) *—

ఈ మాత్రలు బాలురకు కలుగు జ్వరము, అజీర్ణము, ఎగరొప్పు, విరేచనములగుచుండుట, కడుపుబ్బరము, మలబంధము, వాంతులు, జలుబు, కృశించుట, అజీర్ణవిరేచనములు, దగ్గు, యకృత్, (లివరు) పెరుగుట, కడుపుపెరిగి కాళ్ళుచేతులు సన్నగిలుట, విరేచనము వాసనగనుండుట, విరేచనమందు జిగురుపడుట, విరేచనము ఆకుపచ్చగాగాని, అనేక వర్ణములుగగాని అగుచుండుట, అప్పుడప్పుడు జ్వరము జలుబు మొదలగునవి వచ్చుచుండుట, శరీరము వెచ్చగనుండుచుండుట, పాలు సరిగ త్రాగకుండుట, మొదలగు వ్యాధులన్నిటిని అమోఘముగా శాంతింపజేయును. ప్రతిరోజు నొకమాత్ర నుపయోగించుచుండినచో నే వ్యాధియు కలుగనేరదు. పోతపాలనుపోయు ప్రతి పసిపిల్లలకు తప్పక నుపయోగింపదగిన దివ్యామృతము. మద్రాసు, వరంగల్, బెజవాడ, మొదలగు పట్టణములయందలి ధర్మవైద్యశాలలయందు నేను డాక్టరుగ నున్నప్పుడు షుమారు పదివేలమంది బాలురకు నుపయోగించి అమోఘమైన గుణములను కనుగొంటిని. చంటిపిల్లలుకల ప్రతిగృహమందును ఉండతగిన పరమామృతము. ఈమందు గృహమందున్నచో చంటిపిల్లలకు వ్యాధులు ఆ సమీపమునకుకూడ రాజాలవు. ఈ మాత్రలను మొదటినుండియు నుపయోగించుచుండినచో పసిపిల్లలు అధికమగు ఆరోగ్యముకలవారుగను, పుష్టివంతులుగను, సౌందర్యవంతులుగను, నుండగలరు. ప్రతిస్త్రీయును స్వయముగ వాడుకొనవచ్చును. నెలలోపు పిల్లలకుకూడ వాడవచ్చును. వాడవలసిన విధానము, తల్లి చేయవలసిన పథ్యమువగైరా విషయములన్నియు సవిస్తరముగ వ్రాయబడిన పెద్దకాగితము మందుసీసాతో పంపబడును. అందుచే నిచ్చట నింతకంటె వివరముగ వ్రాయలేదు. 50 మాత్రలు సీసా 1కి రు 1-0-0.



# పరిశిష్టము—స్త్రీలు.

## —* 152 త్రైలోక్యచింతామణి *—

దీనియొక్క మహామహిమ అందరికిని తెలిసినదే. ఇది బహుశ్రమతో చాలది

నములవ తయారుచేయబడినది. అమోఘముగా పనిచేయును.దీనిని తేనెతోగాని అల్లపురసముతోగాని శుంఠిరసముతోగాని సేవించినయెడల శ్లేష్మము ఎదుర్కొనుట, ఎగపూపిరి, ఆయాసము, వాడిసన్నగిలుట, శీతలముకమ్ముట మొదలగు లక్షణములను వెంటనే తగ్గించి ఎట్టిఅపాయస్థితిలోనున్న రోగికైనను జీవింపచేయును. మరియు దగ్గు, శ్లేష్మవ్యాధులు, క్షయ, సూతికావ్యాధులు, దోషజ్వరములు, వాతవ్యాధులు, బలహీనత, అజీర్ణము, అగ్నిమాంద్యము, గుండెవ్యాధులు, మొదలగువానిని కూడ వెంటనే నశింపచేయును. మోతాదు $\frac{1}{2}$ మొ॥ 1 గురివిందవరకు. తు1కి రు24-0-0

## —* 153 సూతికాభరణము *—

నిజముగ నిది సూతికాస్త్రీలను రక్షించునదే. యోగమందు చెప్పబడిన పిం ములనన్నిటిని బహువ్యయప్రయాసలకులోనై సంపాదించి ప్రత్యేకమగు శ్రద్ధతో దీనిని తయారుచేస్తిమి.అమోఘములైన గుణములనిచ్చుచున్నది. (1) పిప్పళ్లు, మోడి, సన్నరాస్నము, శుంఠి, చవ్యము, వీనియొక్క కషాయముతో నుపయోగించినయెడల సూతికాస్త్రీకి మైలసరిగ వెడలకుండుట, అధికముగ వెడలుట, నడుమునొప్పులు, తలనొప్పి, వళ్ళునొప్పులు, ఆకలిసరిగ కలగకుండుట, జ్వరము, మొదలగు వ్యాధులన్నియు హరించును. (2) తమలపాకురసముతో నిచ్చినయెడల దగ్గు, వగర్పు, శ్లేష్మము, అజీర్ణము, (3) తేనెతో నిచ్చినయెడల పక్షవాతము, అర్ధవాతము, మొదలగు వాతవ్యాధులు (4) శుంఠిరసముతో నిచ్చినయెడల సన్నిపాతజ్వరము, దోషజ్వరము, కఫజ్వరము, ఎక్కిళ్ళు, అతిసారము మొదలగునవి హరించును. దోషజ్వరములు, కలరా మొదలగు వానియందు శీతలము ఏర్పడినప్పుడు వేడికలుగుటకై దీనిని నిస్సందేహముగ నుపయోగింపవచ్చును.
మోతాదు 1 మొ॥ 2గురివిందగింజలవరకు. తు 1 కి రు 20-0-0

## —* 154 కనకబాల సూర్యోదయము *—

ఇది (1) నేలతాడి, బూరుగబంక,ఏలకాయలు,దాసెనచక్క,వీనియొక్క రెట్టింపుచూర్ణము వెన్న వీనితో సమస్తమగు ప్రదరములు, శుక్లనష్టము,యోనిస్రావములు, (2) మిరియాలు గుంటగలకరావు (ఎండుది) చూర్ణము, వీనిని రెట్టింపుచేర్చి తిప్పతీగ కషాయముతో జీర్ణజ్వరములు, శీతవైశ్యజ్వరములు, అజీర్ణములు, అరుచి (3) లవంగాలు, దాసెనచెక్క, తాలీసపత్రి, వీనియొక్క రెట్టింపుచూర్ణము,తేనె, వీనితో ఆయాసము, దగ్గు, క్షయ, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, వీనిని నశింపచేయును. మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ చిన్నగురవ. తు 1 కి రు 6-0-0.

## —* 155 మహాలక్ష్మీవిలాసము *—

దీనిని (1) రెట్టింపు త్రికటుచూర్ణముతో క్షయ,ఆయాసము,దగ్గు,కృశించుట, అజీర్ణము, అగ్నిమాంద్యము, (2) రెట్టింపు త్రిఫలాచూర్ణముతో శుక్లనష్టము,సమస్తమగు ప్రమేహములు, వ్రణములు, నోటిపూత, కాళ్లులాగుట, కృశించుట, సమస్తమగు ప్రదరములు, వీనియందు దివ్యౌవలయును. ఇది శరీరకాంతిని, బలమును, ఇంద్రియపుష్టిని కలిగించును. మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ చి॥వరకు. తు 1కి రు 8-0-0.

## —* 156 శ్వాసకుఠారము *—

దీనిం (1) తమలపాకుల రసముతో శ్వాస, కాస, అగ్నిమాంద్యము, వాత వ్యాధులు, శ్లేష్మవ్యాధులు, (2) అల్లపురసముతో గుండెవ్యాధులు, అజీర్ణము, సన్నిపాతజ్వరము, తిమ్మిర్లు, వాంతి, వీనియందియ్యవలయును. సన్నిపాతము, మూర్ఛ, అపస్మారము, వీనియందు స్పృహతప్పినప్పుడు దీనిం నస్యము చేయవలసినదిగ శాస్త్రమందు చెప్పబడినది. మోతాదు 1/4 మొ॥ 1/8 చి॥ వరకు. తు 1కి 2-0-0.

## —* 157 కనకసుందరరసము. *—

దీనిని (1) రెట్టింపు పిప్పళ్ళచూర్ణము, తేనె వీనితోగాని రెట్టింపు మిరియాల చూర్ణము, నెయ్యి, వీనితోగాని క్షయ, దగ్గు, ఆయాసము. శ్లేష్మప్రకోపము (2) అల్లపురసముతో సన్నిపాతము, సమస్తజ్వరములు (3) శుంఠిరసముతో అజీర్ణము, అతిసారము, గ్రహణి (4) సమానముగు నేపాలచూర్ణముతో గుల్మము, ఉదరము, యకృద్వ్యాధులు, శూల, వీనియందియ్యవలెను. దీనిని సేవించునప్పుడు వేడిచేయు వస్తువులను తినకూడదు. మోతాదు 1/4 మొ॥ 1/2 చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

## —* 158 శ్లేష్మచింతామణి *—

దీనిని (1) ఆపజెముడాకురసముతో గురక, కఫమెదురొక్కనుట, ఆయాసము, శ్వాస, (2) తమలపాకురసముతో సన్నిపాతజ్వరము, కఫవ్యాధులు, సూతికావాతము, సూతికాజ్వరము, దోషజ్వరములు, కఫజ్వరములు, విషమజ్వరములు, వీనియందియ్యవలెను. కఫమును వెంటనే ఖండించును. తక్కువ మోతాదులో చంటిపిల్లలకు పైవ్యాధులలో వాడవచ్చును. మోతాదు 1/8 మొ॥ 1/4 చి॥వరకు. తు 1కి రు8-0-0.

## —* 159 రాజమృగాంకరసము *—

దీనిని (1) మిరియాలు, పిప్పళ్లు, వీనియొక్క రెట్టింపు చూర్ణము, నెయ్యి వీనితో దగ్గు, ఆయాసము, క్షయ, (2) అడ్డసరపురసముతో కఫమెదురొక్కనుట, శ్లేష్మప్రకోపము, (3) రెట్టింపు శుంఠిచూర్ణముతో అజీర్ణము, శూల, పరిణామశూల, అగ్నిమాంద్యము, అమ్లపిత్తము, వీనియందియ్యవలయును. ఇది క్షయలకు ప్రసిద్ధమైనది. మోతాదు 1/4 మొ॥ 1/2 చి॥ వరకు. తు 1కి రు 8-0-0.

## —* 160 క్రిమికుఠారము *—

ఇది (1) వాముర సముతో క్రిములు, అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి, కడుపుబ్బరము, శూల, మలబంధము, వాంతి మొదలగువానిని నశింపచేయును. క్రిమివ్యాధులను హరించుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. సమస్త క్రిమివ్యాధులయందు నుపయోగింపవచ్చును. మోతాదు 1/2 మొ॥ 1 చి॥వరకు తు 1కి రు 1-8-0

## —* 161 ప్రదరాంతకరసము *—

దీనిని (1) రెట్టింపు త్రిఫలాచూర్ణము, మేడిచెక్క కషాయము వీనితో సేవించినయెడల సమస్తమగు ప్రదరవ్యాధులు నశించును. (2) వెన్నతో సేవించినయెడల

శుక్లనష్టము, దగ్గు, క్షయ, మొదలగునవి నశించును. ప్రదరవ్యాధులకు నిది ప్రత్యేకముగ చెప్పబడినది. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

—* 162 తరుణార్కము *—

దీనిని (1) తమలపాకులరసముతో నిచ్చినయెడల కఫ మెదురెక్కుట, గురక, కాళ్ళుచేతులు చల్లబడుట, చెమటలు, మగత, నాడీనిరసించుట మొదలగునవియు (2) అల్లపురసముతో నిచ్చినయెడల సన్నిపాత జ్వరములు, దోషజ్వరములు, విషజ్వరములు మొదలగునవియు నశించును. అతితీవ్రముగ పనిచేయును.
మోతాదు ⅛ మొ॥ ¼ చి॥ వరకు. రు 1కి 20 మా. తు 1కి రు 16-0-0.

—* 163 జ్వరాంకుశము *—

దీనిని (1) మిరియాల రసముతో కఫజ్వరములు, జలుబు, దగ్గు, పడలునొప్పులు (2) అల్లపురసముతో ఏకాహిక ద్వ్యాహికాదిజ్వరములు, దోషజ్వరములు, సన్నిపాతజ్వరములు, వాతజ్వరములు, వీనియందియ్యవలయును. జ్వరములకు నిజముగ నిది యంకుశమే. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 1-8-0.

—* 164 మహాలోకనాథము *—

దీనిని (1) త్రిఫలా కషాయముతో నంజు, ఆయాసము, క్షయ, దగ్గు, పాండువు, కామిర్ల, (2) సన్నరాస్నపుగంధముతో వాతవ్యాధులు, అగ్నిమాంద్యము, మూతికా వాతము, (3) వాముర సముతో శూల, అజీర్ణము, గుండెవ్యాధులు, క్రిమివ్యాధులు, వీనియందియ్యవలయును. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

—* 165 నవలోహ చింతామణి *—

దీనిని (1) అడ్డసరపురసముతో ఏకాదశక్షయలు, దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, (2) అల్లపురసముతో అజీర్ణములు, అగ్నిమాంద్యము, జీర్ణజ్వరము, శూల, (3) కెట్టింపు చంద్రచూర్ణముతో కుష్ఠములు, చర్మవ్యాధులు మొదలగువానియందియ్యవలయును. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 10-0-0.

—* 166 వాతాగ్నికుమారము *—

దీనిని (1) కెట్టింపు మిరియాలచూర్ణముతో జీర్ణజ్వరము, దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మవ్యాధులు, శ్లేష్మజ్వరము, (2) తుమ్మిపువ్వులరసముతో శీతజ్వరము, (3) తమలపాకురసముతో అపబాహుకము, సర్వాంగవాతము, గృధ్రసీవాతము మొదలగు వాతవ్యాధులు, (4) కెట్టింపువాకుచీచూర్ణముతో సమస్తమగు కుష్ఠములు, సమస్తమగు చర్మవ్యాధులు, మొదలగువానియందియ్యవలయును. రక్తశుద్ధిచేయును.
మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 8-0-0.

—* 167 శ్వాసకాళేశ్వర రసము *—

ఇది (1) అల్లపురసముతో పంచకాసలు, శ్వాస, క్షయ, శ్లేష్మ వ్యాధులు, అజీర్ణము, అగ్నిమాంద్యము, మలబంధము మొదలగువానిని నశింపచేయును. శ్వాసలకు దీనిని ప్రధానముగ వాడెదరు. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1కి రు 2-8-0.

## —* 168 ద్విగుణసిందూరము *—

ఇది (1) రెట్టింపు సుగంధిపాలచూర్ణముతో జీర్ణించిన సవాయివ్యాధులు, కొరుకు, పొడలు, దురద, ఉడుకువ్యాధులు, కాళ్లుచేతులు మంట, శుక్లనష్టము, శరీర మెల్లప్పుడు వెచ్చగనుండుట, రక్తదోషములు, కృశించుట, దగ్గు మొదలగు వ్యాధులను నశింపజేయును. రక్తశుద్ధిని చేయుచు జీర్ణించిన సవాయివ్యాధులను తగ్గించుటలో మిక్కిలి శ్రేష్టమైనది. మోతాదు ¼ మొ॥ ½ చి॥వరకు. తు 1కి రు 3-0-0

## —* 169 కఫహాపైత్యాంతకము. *—

ఇది (1) శుంఠిరసముతో అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి, నోటనీరూరుట, తలతిరుగుట, వాంతి, సమస్తమగు పైత్యవ్యాధులు, ఎక్కిళ్ళు, ఉడుకువ్యాధులు, వికారముగనుండుట, కడుపులోమంట నోటిపూత మొదలగువానిని వెంటనే హరింపచేయును. మోతాదు ¼ మొ॥ 1 చి॥వరకు. తు 1కి రు 1-8-0

## —* 170 పంచలోహరసాయనము *—

దీనిని (1) వెన్నతో శుక్లనష్టము మొదలగు సమస్తమేహములు, (2) తేనెతో నంజు, గుండెవ్యాధులు, కామిర్లు, పాండువు, తిమ్మెర్లు (3) రెట్టింపు త్రిజాతచూర్ణముతో దగ్గు, ఆయాసము వీనియందు దియ్యవలయును. ఇందు వంగ లోహ అభ్రకాదులు చేరియున్నవి. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1 కి రు 4-0-0.

## —* 171 వంగేశ్వరరసము *—

ఇది (1) రెట్టింపు తంగేడుపువ్వుల చూర్ణము, పంచదార వీనితో శుక్లనష్టము, పాడిదగ్గు, గుండెదడ, (2) సమానమగు తిప్పసత్తు, వెన్న వీనితో శ్వేతప్రదరము, రక్తప్రదరము, యోనిస్రావము, రక్తార్శస్సు, మూత్రకృఛ్రము, అతిమూత్రము, మధుమేహము (3) బూరుగబంక, పెన్నేరు, పల్లేరువిత్తులు, నేలతాడి, దూలగొండి విత్తులు, అతిమధురము వీనియొక్క మూడురెట్ల చూర్ణము పంచదార వీనితో శుక్రము నీరువలె పలచగనుండుట, శీఘ్రస్ఖలనము, ఉత్థాపనశక్తి సరిగలేకుండుట, మొదలగువానిని నశింపచేయును. మోతాదు ¼ మొ॥ ¾ చి॥వరకు. తు 1 కి రు 2-0-0

## —* 172 క్షయకుఠారము *—

దీనిని (1) నేలమునగ వేళ్ళరసముతో క్షయ, దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, క్షయవలన కలిగిన వ్యాధులు (2) రెట్టింపు గలిజేరువేళ్ళచూర్ణముతో నంజు, కామిర్లు, పాండువు, జీర్ణజ్వరము, అజీర్ణము, గుల్మము, వాతవ్యాధులు, మొదలగు వానియందియ్యవలయును. మోతాదు ¼ మొ॥ ½ చి॥వరకు. తు 1కి రు 6-0-0.

## —* 173 శూలగజకేసరి *—

దీనిని (1) తమలపాకులతో పుచ్చుకొని వెంటనే శు॥ఇంగువ, శుంఠి, జీలకర్ర, వస, మిరియాలు వీనియొక్క మూడురెట్ల చూర్ణమును పుచ్చుకొని వేడినీళ్లు త్రాగినయెడల సమస్తశూలలు, అజీర్ణము, కడుపుబ్బరము, అరుచి, అగ్నిమాంద్యము,

దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, అతిసారము మొదలగు నవిహరించును. శూలను దివ్యౌషధము. మోతాదు ¼ మొ॥ ¾ చి॥ వరకు. తు 1కి రు 2-0-0

—* 174 అజీర్ణగజకేసరి *—

ఇది (1) రెట్టింపు త్రికటుచూర్ణము, జీడిపరు వీటితో సమస్తమగు అజీర్ణములు, అమ్లపిత్తము, శూల, మలబంధము, పరిణామశూల, కడుపుబ్బరము, వాంతులు, త్రేపులరచుట, అతిసారము, గ్రహణీరోగము, శ్లేష్మవ్యాధులు, మొదలగువానిని నశింపచేయును. మోతాదు ¼ మొ॥ ¾ చి॥ వరకు. తు 1కి రు. 2-0-0.

—* 175 అయస్కాంతభస్మ *—

దీనిని (1) నేలతాడి, మిరియాలు, కటుకరోహిణి, కరకబెరడు, వీని యొక్క రెట్టింపుచూర్ణముతో నంజు, అజీర్ణము, పాండువు, జీర్ణజ్వరము, (2) పిప్పళ్లు చవ్యము, సన్నరాస్నము, వీనియొక్క రెట్టింపుచూర్ణము తేనె వీటితో దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మవ్యాధులు, (3) మూడురెట్లు అతిమధుర చూర్ణము, పంచదార వీనితో గుండెదడ మొదలగు గుండెవ్యాధులు ఉన్మాదము మొదలగు మెదడువ్యాధులు (4) రెట్టింపు మిరియాల చూర్ణముతో బహిష్టు సరిగ కాకుండుట, శ్వేతరక్తప్రదరములు, (5) తేనెతో స్థౌల్యరోగములు, (6) వాయువిడంగములు, ముత్తవపులగపువేళ్ళు, మోడి, వీనియొక్క రెట్టింపు చూర్ణము, తేనె వీనితో సమస్తమగు వాతవ్యాధులు, సూతికావ్యాధులు, గుల్మము, ఉదరవ్యాధులు, ప్లీహయకృద్వ్యాధులు, వీనియందియ్యవలెను. రక్తమును శుభ్రపరచి వృద్ధిపరచుటలో మిక్కిలి శ్రేష్టమైనది. అనుపానభేదముతో రక్తదోషములు, చర్మదోషములు, జీర్ణించిన సవాయివ్యాధులు మొదలగువానియందుకూడ నియ్యవచ్చును. మోతాదు ¼ చి॥ మొ॥ ¾ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

—* 176 కాంతాభ్రక సిందూరము *—

గుణములు,అనుపానములు వగైరాలకు 51 నెంబరు లోహాభ్రకసిందూరమును చూడుడు.సమస్తవ్యాధులయందును బహుసామ్యముగ పనిచేయును తు.1కిరు4-0-0.

—* 177 త్రివంగభస్మ *—

దీనిని (1) రెట్టింపు త్రిజాత లేక త్రిఫలాచూర్ణము, పంచదార వీనితో నోటిపూత, గుండెలలో మంట, కాళ్ళుచేతుల మంట, నేత్రవ్యాధులు, సమస్తమగు ప్రమేహములు, నడుము నొప్పులు, కుష్కించుట, (2) వెన్నతో శుక్లనష్టము, శ్వేతరక్తప్రదరములు, యోనిస్రావములు, (3) కలజందరసముతో సమస్తమగు సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, మూత్రనాళమందలి మంట, శరీర మెల్లప్పుడు వెచ్చగనుండుట, బలహీనత మొదలగు వ్యాధులయందియ్యవలయును. ఇందు సీసము వంగము సత్తు ఈ మూడును కలిసియుండుటచే మేహసంబంధమగు ప్రతివ్యాధియందును అమోఘముగ పనిచేయును.
మోతాదు ¼ మొ॥ ¾ చి॥ వరకు. తు 1కి రు 3-0-0.

—* 178 సత్తుభస్మ *—

దీనిని (1) చలవమిరియాలు, అతిమధురము, తెల్లచందనంపొట్టు, వీనియొక్క రెట్టింపుచూర్ణము, పంచదార వీనితో సెగవ్యాధులు, మూత్రముబొట్లుబొట్లగపడుట, మూత్రనాళమందలిమంట, మూత్రము తొందరగవచ్చుట, (2) మీగడతో శుక్లనష్టము, శ్వేతరక్తప్రదరములు మొదలగు మేహవ్యాధులు వీనియందియ్యవలయును. దీనిని కొన్ని నేత్రవ్యాధులయందు పైకి నుపయోగించెదరు.
మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{3}{4}$ చి॥ వరకు. తు 1కి రు 1-8-0.

—* 179 పగడభస్మ *—

దీనిని (1) తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మవ్యాధులు, అజీర్ణము, స్వరభేదము (2) వెన్నతో శ్వేతరక్తప్రదరములు, శుక్లనష్టము, ప్రమేహవ్యాధులు మొదలగు వాని యందియ్యవలయును ప్రతిదినము తమలపాకులతో నుపయోగించినయెడల అజీర్ణములను, దగ్గును దరికి చేరనివ్వదు. మాగిరాళ, అసలుపగడములే భస్మ చేయుబడినవి. మోతాదు $\frac{1}{8}$ మొ॥ $\frac{1}{4}$ చి॥ వరకు. తు 1కి రు 2-0-0.

—* 180 తారమాక్షిక భస్మ *—

దీనిని (1) తేనెతో అజీర్ణము, పాండువు, నంజు, గుండెవ్యాధులు, (2) వెన్నతో శుక్లనష్టము, ప్రమేహములు, దగ్గు, ఆయాసము, క్షయ, రక్తార్శస్సు, మొదలగు వ్యాధులయందుపయోగింపవలెను. మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 1 0-0.

—* 181 శుక్తిభస్మ *—

దీనిని (1) తేనెతో దగ్గు, ఆయాసము, శ్లేష్మప్రకోపము, అజీర్ణము, శూల, పరిణామశూల, గుండెవ్యాధులు, అగ్నిమాంద్యము మొదలగువానియందుపయోగింపవలయును. మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 0-6-0.

—* 182 ముత్యపుచూరు భస్మ *—

ఇది (1) లవంగాలు, మిరియాలు, వీనియొక్క రెట్టింపుచూర్ణముతో దగ్గు, ఆయాసము, క్షయ, అజీర్ణము, అగ్నిమాంద్యము (2) పంచదారతో ప్రమేహవ్యాధులు, శుక్లనష్టము, సెగవ్యాధి మొదలగువానిని నశింపచేయును. ప్రతిదినము తమలపాకులతో నుపయోగించుచుండినయెడల క్షయ, అజీర్ణము మొదలగు వ్యాధులను దరికి చేరనివ్వదు. మోతాదు $\frac{1}{8}$ మొ॥ $\frac{1}{4}$ చి॥ వరకు. తు 1కి 20-0-0

—* 183 తాలక సిందూరము *—

దీనిని (1) తేనెతో నుపయోగించినయెడల శ్లేష్మవ్యాధులు, క్షయ, దగ్గు, ఆయాసము, కుష్ఠములు, చర్మవ్యాధులు, సవాయివ్యాధులు, మొదలగునవి వెంటనే హరించును. మోతాదు 1 మొ॥ 2 యవలు వరకు. తు 1కి రు 2-0-0.

—* 184 ఇంగిలీక సిందూరము *—

దీనిని (1) తమలపాకుల రసముతో చంటిపిల్లలకు కలుగు దగ్గు, జలుబు, ఆయాసము, జ్వరము, శ్లేష్మప్రకోపము (2) తేనెతోగాని చనుపాలతోగాని, చం

పిల్లలకు శరీరము పల్లప్పుడు వేడిగనుండుట, చిక్కిపోవుట, మొదలగువ్యాధులు,(3) తేనెతో పెద్దవారలకు కాళ్ళుచేతులు మంటలు ఉడుకువ్యాధులు మొదలగువాని యందియ్యవలయును. మోతాదు $\frac{1}{4}$ మొ|| $\frac{1}{2}$ చి|| వరకు. తు 1కి రు 1-0-0

— * 185 రాతినారభస్మ * —

ఇది (1) పంచదారతో నుపయోగించినయెడలమూత్రకృచ్ఛ్రము, సెగవ్యాధులు, శుక్లనష్టము మొదలగు వేడివలన కలిగినవ్యాధులను వెంటనేహరించచేయును. త్వరలో పనిచేయును. మోతాదు $\frac{1}{2}$ మొ|| 1 చి|| వరకు. తు 1 కి రు 0-6-0.

— * 186 సూరేకారభస్మ * —

దీనిని (1) పంచదార లేక నెయ్యి లేక నీటితో నిచ్చినయెడల మూత్రకృచ్ఛ్రము, మూత్రనాళిమందలి మంట, సెగవ్యాధులు, మూత్రముబంధించుట, మూత్రము బొట్లుబొట్లుగ వచ్చుట మొదలగువ్యాధులు వెంటనేనశించును. అతిత్వరలో పనిచేయును. మోతాదు $\frac{1}{2}$ మొ|| 1 చి|| వరకు. తు 1కి రు 0-6-0

— * 187 స్ఫటిక [పటిక] భస్మ * —

దీనిని (1) వెన్నతో గాని కలుబందరసముతో గాని నుపయోగించిన యెడల సెగవ్యాధులు, శుక్లనష్టము, నోటిపూత, ప్రదరవ్యాధులు, ప్రమేహములు మొదలగునవి వెంటనే హరించును. మోతాదు $\frac{1}{2}$ మొ|| 1 చి||వరకు. తు 1కి రు 0-6-0.

— * 188 త్రిజాతచూర్ణము * —

దీనిని (1) తేనెతో సేవించినయెడల నోటిపూత, గుండెలలో మంట, ఉడుకు, తాపజ్వరములు, (2) వెన్నతో సేవించినయెడల మేహవ్యాధులు, శుక్లనష్టము, శుక్లము పలచనగానుండుట, నీరసము, ప్రదరవ్యాధులు, ఉడుకుజ్వరములు. మొదలగునవి వెంటనే హరించును. మోతాదు $\frac{1}{16}$ మొ|| $\frac{1}{8}$ తు|| వరకు. పా 1కి రు [illegible]-0.

— * 189 త్రికటుచూర్ణము * —

దీనిని (1) ఉడుకు నీళ్ళతో సేవించినయెడల అజీర్ణము, కడుపుబ్బరము, ప్రేగులరచుట, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, శూలలు, పులి త్రేనుపులు మొదలగునవి (2) తేనెతో సేవించినచో జ్వరములు, శ్లేష్మము, జలుబు, ఆయాసము, మొదలగునవి వెంటనేనశించును. మోతాదు $\frac{1}{12}$ మొ|| $\frac{1}{6}$ తు||వరకు. పా 1కి రు4-0-0.

— * 190 చాతుర్జాతచూర్ణము * —

దీనిని (1) పంచదారతో నుపయోగించినయెడల మేహవ్యాధులు, ఉడుకు వ్యాధులు, నోటిపూత, శుక్లనష్టము, సెగవ్యాధులు, ప్రదరవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, సవామేహమువల్ల జీర్ణించినవ్యాధులు, అరుచి, దగ్గు, శ్వాస మొదలగునవి నశించును. మోతాదు $\frac{1}{12}$ మొ|| $\frac{1}{6}$ తు|| వరకు. పా 1కి రు 5-0-0.

— * 191 స్థాలీచూర్ణము * —

దీనిని (1) ఉడుకునీళ్ళతో సేవించినయెడల మలబంధము, శోఫ, ఆయాసము,

అగ్నిమాంద్యము, అజీర్ణము, కడుపుబ్బరము, త్రేగులరచుట, కడుపుపెరుగుట మొదలగునవి హరించును. మోతాదు $\frac{1}{12}$ మె॥ $\frac{1}{6}$ తు॥ వరకు. తొ 1కి రు 4-0-0.

## —* 192 గోక్షురాదిచూర్ణము. *—

దీనిని (1) పంచదారతో సేవించినయెడల సెగవ్యాధులు, మూత్రనాళమందు మంట, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, చురుకు, పోటు మొదలగు మూత్రవ్యాధులు వెంటనే నశించును. మోతాదు $\frac{1}{12}$ మె॥ $\frac{1}{6}$ తు॥ వరకు. తొ 1కి రు 3-0-0.

## —* 193 అగ్నిముఖచూర్ణము *—

దీనిని (1) మద్యముతో పుచ్చుకొనినయెడల అజీర్ణము, కడుపుబ్బరము, త్రేగులరచుట, అగ్నిమాంద్యము, శూల మొదలగునవియు, (2) వేడినీటితో సేవించినయెడల శరీరపీడ, విషవ్యాధులు, మూలవ్యాధి, ఉదరము, గుల్మము మొదలగునవియు హరించును. మోతాదు $\frac{1}{12}$ మె॥ $\frac{1}{6}$ తు॥ వరకు. తొ 1కి రు 3-0-0.

## —* 194 స్ఫటికాదిచూర్ణము *—

దీనిని (1) తేనెతోగాని, కేవలముగాని పండ్లకు రుద్దినయెడల చిగుళ్లువుబ్బుట, చీముకారుట, రక్తము స్రవించుట, దంతములపోటు, దంతములు కదలుట, మొదలగునవినశించును. (2) పైనచల్లినచో దుర్మాంసములను కోసి వ్రణములనుమాన్పును, (3) నేతితోకల్పి పూసినయెడల నోటిపూత మానును. (4) తేనెతోకల్పి కొండనాలుకకు పట్టించినయెడల కొండనాలుక తగ్గిపోవును. దీనిని ప్రతిదినము పండ్లపొడిగ నుపయోగింపవచ్చును. మోతాదు అవసరమైనంత. తొ 1కి రు 3-0-0.

## —* 195 తాంబూలవటి *—

దీనిని (1) ప్రతిదినము తాంబూలముతో నుపయోగించుచుండినయెడల అరుచి, నోరు అసహ్యముగనుండుట, అజీర్ణము, మలబంధము, దగ్గు మొదలగునవినశించును. మంచి సువాసనను గలిగియుండును. మోతాదు 1 మె॥ 2 మా॥ వరకు. మా॥ 50 కి రు 0-12-0.

## —* 196 గోక్షురాదిగుగ్గులు *—

దీనిని (1) కొండపిండి కషాయముతోగాని, నీటితోగాని, యుపయోగించినయెడల మూత్రకృచ్ఛ్రము, శుక్లనష్టము, సెగవ్యాధులు, లింగమందలి వ్రణము, మొదలగునవి నశించును. మోతాదు 1 మె॥ 2 మా॥ వరకు. మా॥ 50 కి రు 1-0-0.

## —* 197 కైశోర గుగ్గులు *—

దీనిని (1) సుగంధిపాల కషాయముతోగాని, నీటితోగాని యుపయోగించినయెడల వాతరక్తము, వాతశోణితము, వాతవ్యాధులు, జీర్ణించిన సవాయివ్యాధులు, సెగవ్యాధులు, కుష్టములు, భగందరము, అర్శస్సు, మేహపిటికలు, వ్రణములు, మొదలగునవి వెంటనే నశించును. మోతాదు 1 మె॥ 2 మా॥ వరకు. మా 50 కి రు 0-12-0.

## —* 198 త్రిఫలా గుగ్గులు *—

ఇది (1) ఉలిగడ్డల కషాయముతో భగందరము, వ్రణములు, నోటిపూత, నేత్రవ్యాధులు, (2) సుగంధిపాల కషాయముతో ప్రమేహములు, శుక్లనష్టములు, కుష్టములు,

అనుపానము, ప్రదరవ్యాధులు, బొల్లి, సెగవ్యాధులు, మొదలగువానిని నశింపచేయును.
మోతాదు 1 మొ॥ 2 మా॥ వరకు. మా 50 కి రు 0-12-0.

—* 199 ఇచ్ఛాభేది *—

దీని (1) రాత్రిపరుండునప్పుడు ఒకమాత్రను మ్రింగినచో ఉదయముననే సుఖవిరేచనము అవును (2) ఉదయమున మూడు, లేక నాలుగుమాత్రలు మ్రింగి కొద్ది వేడినీళ్ళను త్రాగినయెడల అయిదు, లేక ఆరు విరేచనములు సుఖముగా అవును. దీనిని వేడినీటితో నుపయోగించినయెడల గుల్మము, ఉదరవ్యాధులు, ప్లీహవ్యాధులు, యకృత్ వ్యాధులు, మలబంధము, కడుపుబ్బరము, మూలవ్యాధి, పైత్యవ్యాధులు, అజీర్ణము మొదలగునవి వెంటనే హరించును. ఇందు నేపాళము కలిసినను, దుర్గుణములను కలిగింపకయే పనిచేయును.
మోతాదు 1 మొదలు 4 మా॥ వరకు. మా 50 కి రు 0-12-0.

—* 200 శంఖవటి *—

దీని (1) వేడినీటితో నుపయోగించినయెడల సమస్తమగు అజీర్ణములు, గుల్మము, శూల, నంజు, కడుపుబ్బరము, ప్రేగులరచుట, పరిణామశూల, జ్వరము, ఉదరము, మూత్రకృచ్ఛ్రము, వాతరక్తము, కఫవ్యాధులు, మూలవ్యాధి మొదలగు వ్యాధులు అగ్నిచే దూదివలె వెంటనే నశించును. (2) వాము మొదలగు అనుపానములతో కూడ వాడవచ్చును. మోతాదు 1 మొ॥ 2 మా॥ వరకు. మా 50 కి రు 0-12-0.

—* 201 కిరాతారిష్టము *—

దీని ¼ మొ॥ ½ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి యిచ్చినయెడల పురాణజ్వరములు, జీర్ణజ్వరములు, చలిజ్వరములు, శ్లేష్మజ్వరములు, అజీర్ణము, ధాతుగతజ్వరము, మలబంధము, చర్మవ్యాధులు, అరుచి, అగ్నిమాంద్యము మొదలగునవి వెంటనే హరించును. ఇది రక్తశుద్ధినిచేయును. పౌ 1కి రు 1-4-0.

—* 202 జీరకాద్యరిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు రెట్టింపు నీటితో కలిపి యిచ్చినయెడల సూతికావ్యాధులు, గ్రహణీరోగము, అతిసారము, అరుచి, అగ్నిమాంద్యము, పైత్యవ్యాధులు, మొదలగునవి వెంటనే హరించును. పౌ 1కి రు 3-0-0.

—* 203 పునర్నవారిష్టము *—

దీనిని ¼ మొ॥ ½ ఔన్సువరకు రెట్టింపునీటితో కలిపిసేవించినయెడల నంజు, పాండువు, అజీర్ణము, గుండెవ్యాధులు, ఉదరవ్యాధులు, గుల్మము, ప్లీహవ్యాధులు, యకృత్ వ్యాధులు, దగ్గు, ఆయాసము, వాతవ్యాధులు, అతిసారము, జీర్ణజ్వరము, కామిర్లు ఇవి వెంటనే నశించును. పౌ 1కి రు 1-4-0.

—* 204 భృంగరాజాసవము *—

దీనిని ¼ మొదలు ½ ఔన్సువరకు రెట్టింపునీటితో కలిపి సేవించినయెడల

పాండువు, వంజు, జీర్ణజ్వరము, కామిర్లు, అజీర్ణము, దగ్గు, ఆయాసము, గుండెవ్యాధులు, కృశించుట, శుక్రము క్షీణించుట, ఇవి హరించును. పౌ 1 కి రు 1-4-0.

—* 205 కుమార్యాసవము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ ఔన్సువరకు రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల దగ్గు, క్షయ, ఆయాసము, హృద్రోగము, శుక్లనష్టము, సమస్తమగు ప్రమేహములు, సమస్తమగు సెగవ్యాధులు, సమస్తమగు ప్రదరములు, మూత్రకృచ్ఛ్రము, రక్తపిత్తము మొదలగు వేడివలనకలిగిన వ్యాధులన్నియు నిశ్చయముగ హరించును. పౌ 1 కి 1-4-0.

—* 206 తక్రారిష్టము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల మూలవ్యాధి, అజీర్ణము, అగ్నిమాంద్యము, అరుచి మొదలగునవి వెంటనే నశించును. కఫవాతములకానులోమ్యము కలుగును. జఠరదీప్తియు, శరీరకాంతియు, కలుగును. దీనిని మేము ప్రత్యేకమగు మార్పుతో తయారుచేసితిమి. పౌ 1కి 1-4-0.

—* 207 దశమూలారిష్టము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల పక్షవాతము మొదలగు సమస్త వాతవ్యాధులు, సూతికావాతములు, క్షయ, దగ్గు, ఆయాసము, అగ్నిమాంద్యము, అజీర్ణము, ధాతుక్షయ, అరుచి, శూల, మొదలగువ్యాధులు వెంటనే నశించును. నరములకు బలమును, శుక్రవృద్ధిని, సంతానమును, కలిగించును ఇందు కస్తూరి కలయును. పౌ 1 కి రు 2-0-0.

—* 208 ఉశీరాసవము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ ఔన్సువరకు సమానము లేక రెట్టింపు నీటిలో కలిపి సేవించినయెడల రక్తపిత్తము కుష్ఠములు, రక్తార్శస్సు, దప్పిక, తాపము, రక్తదోషములు, సమస్తమగుప్రమేహములు, గుండెదడ, శుక్లనష్టము, శరీరమెల్లప్పుడు వెచ్చగనుండుట మొదలగు వేడివలన కలిగిన వ్యాధులన్నియు వెంటనే నశించును. దీనిని వేసవికాలమందు సేవించినచో వేసవిభయముండనేరదు. పౌ 1 కి రు 1-4-0.

—* 209 ఖదిరారిష్టము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ ఔన్సువరకు సమానము లేక రెట్టింపునీటిలో కలిపిసేవించినయెడల సమస్తమగు కుష్ఠములు, దగ్గు, గుండెవ్యాధులు, ప్లీహవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, చర్మవ్యాధులు, రక్తదోషములు, ఇవి హరించును. పౌ 1 కి రు 1-4-0.

—* 210 అర్జునఘృతము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ తు॥వరకు ఆవుపాలతో సేవించినయెడల గుండెదడ, గుండెనొప్పి, గుండెశూల, గుండెబలహీనముగనుండుట మొదలగు సమస్తమగు గుండెవ్యాధులును నశించును. శరీరమునకు పుష్టికలుగును. ఔ 4 కి రు 1-4-0.

—* 211 అశ్వగంధఘృతము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ తు॥ వరకు ఆవుపాలతో సేవించినయెడల శరీరమునకు అమితమగు పుష్టికలుగును. శుక్రము తక్కువగనున్నవారలకు మిక్కిలి శ్రేష్ఠమైనది. ధాతు

క్షయ, క్షయ, ఉరఃక్షతము, వంధ్యాత్వము, వీనిని నశింపజేయును. జా 4కి రు 1-8-0.

—* 212 కేతకీతైలము *—

దీనిని పైనరుద్దినచో మేహవాతనొప్పులు, అర్దితవాతము, ఆమవాతము, ధనుర్వాతము, అపబాహుకవాతము, తిమిరవాతము, సర్వాంగవాతము, మొదలగునవి వెంటనే హరించును. వాతహరములలో శ్రేష్ఠమైనది. జా 4కి రు 1-0-0.

—* 213 హింగుత్రిగుణతైలము *—

దీనిని ¼ మొ॥ 1తు॥ వరకు వేడినీటితో కూడ సేవించినయెడల సుఖవిరేచనమగుచు గుల్మములు, ఉదరవ్యాధి, అంత్రవృద్ధి, క్షయ, శూల, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, నశించును. పసిపిల్లలకు సమస్తవ్యాధులందు పనిచేయును. చెవిలో వేసినయెడల కర్ణవ్యాధులన్నియు హరించును. ఆముదముతో తయారు చేయబడినది. జా 4కి రు 1-0-0.

—* 214 ఛాగమాంసతైలము *—

దీనిని ఉపయోగించినయెడల, పక్షవాతము, అర్దితవాతము, అపబాహుకము, చెముడు, తిమిరము, కంపవాతము, మన్యాస్తంభము, చెక్కిళ్ళుపట్టుకొనుట, పంగువాతము, చెవిలోపోటు మొదలగునవి హరించును. దీనిని త్రాగుట, వస్తికర్మ, అభ్యంగనము, నస్యము, చెవిలో వేయుట, కంటిలో వేయుట, మొదలగువానికి నుపయోగించవచ్చునని శాస్త్రమందు చెప్పబడినది. జా 4కి రు 1-4-0.

—* 215 భృంగరాజతైలము *—

దీనిని శిరస్సునందు మర్దించినయెడల వెంట్రుకలు వూడిపోవుట, వెంట్రుకలు తెల్లబడుట, వెంట్రుకలు పెరుగకుండుట, వెంట్రుకలు పెలుసుగనుండుట, బట్టతల, కర్ణవ్యాధులు, నేత్రవ్యాధులు, మొదలగునవి నశించును. వెంట్రుకలను నిగనిగ ప్రకాశించుచు పచ్చువలె నధికముగ పెరుగునట్లుచేయును. జా 4కి రు 1-0-0.

—* 216 నిర్గుండ్యాది తైలము *—

దీనిని చెవులో వేసినయెడల చెముడు, చెవులయందు ధ్వని, బాధ, క్రిములు, చీము, మొదలగునవి నశించును. పైనపూసినచో వాతవ్యాధులన్నియు కూడ హరించును. వాతములను హరించుటలో శ్రేష్ఠమైనది. జా 4కి రు 1-0-0.

—* 217 నారసింహ [శతమూలికాది] లేహ్యము *—

దీనిని ⅙ తు॥ మొ॥ ½ తు॥ వరకు ఆవుపాలతో సేవించి హితమైన ఆహారమును భుజింపుచుండినచో ముసలివాడుకూడ యవ్వనవంతుడగును. అధికమగు శుక్రవృద్ధియు సంభోగకాంక్షయు కలుగును. శుక్రము పలుచగనుండుట, శీఘ్రస్ఖలనము, శుక్లనష్టము, బలహీనత, నడుమునొప్పులు, నశించును. అధికమగుబలమును, శరీరకాంతియు కలుగును. మరియు జీర్ణించిన సవాయివ్యాధులను, సమస్తకుష్ఠములను, చర్మవ్యాధులను, రక్తదోషములను, వాతవ్యాధులను, సమస్తమగు మేహవ్యాధులను, క్షయను, కాసశ్వాసలను హరించును. మిక్కిలి శ్రేష్ఠమైనది. జా 1కి రు 5-0-0.

## —* 218 పంచతిక్తపానకము *—

దీనిని ½ మొ॥ 1¼ తు॥ వరకు 2-3 తులముల నీటిలోకలిపి సేవించినయెడల పురాణజ్వరములు, జీర్ణజ్వరములు, విషజ్వరములు, శీతపైత్య (చలి) జ్వరములు, యకృద్వ్యాధులు, ప్లీహావ్యాధులు, స్ఫోటకము, అరుచి, అగ్నిమాంద్యము, నోటిపూత, ప్లేగు, మొదలగువ్యాధులను నశింపచేయును. మరియు శరీరమెల్లపుడు వెచ్చగనుండుట, సవాయివ్యాధులు జీర్ణించుటవల్ల కలిగినవ్యాధులు, చేతులు నల్లగనుండుట, చిడుము, దురద, కామిర్ల, మలబంధము, అజీర్ణము, చర్మవ్యాధులు, రక్తదోషములు, బలహీనత, శరీరతాపము, వీనినికూడ హరింపచేయును. జా 4 కి రు 0-12-0.

## —* 219 జంబీరాది పానకము *—

దీనిని ½ మొ॥ 1¼ తు॥ వరకు 2-3 తులములనీటిలో కలిపి సేవించినయెడల సమస్తమగు పైత్యవ్యాధులు, అగ్నిమాంద్యము, అరుచి, నోటిపూత, అజీర్ణము, నోటనీరూరుట, కడుపులోమంట, పుల్లనిత్రేణుపులు, తలతిరుగుట, వాంతి, వేడిమి, దద్దుర్లు, తాపము, దప్పిక, రక్తదోషములు, యకృద్వ్యాధులు, కామిర్ల, వికారముగనుండుట, మొదలగువ్యాధులు వెంటనే హరించును. ఇది గర్భిణీస్త్రీలకుకలుగు అయాలక్షణములను పైవ్యాధులను పోగొట్టుటయేగాక సుఖప్రసవమును ఆరోగ్యసంతానమునుకూడ కలిగించును. మిక్కిలిశ్రేష్టమయినది. జా 4 కి రు 0-12-0.

## —* 220 శంఖద్రావకము *—

దీనిని 5 మొదలు 8 చుక్కలువరకు ఆయాద్రావకములలోగాని, వాము మొదలగువాటికషాయములలోగాని నీటిలోగాని కలిపి సేవించినయెడల శూల, అజీర్ణము, కడుపుబ్బరము, ప్లీహాభివృద్ధి, యకృత్ వ్యాధులు, పరిణామశూల, ప్రేగులరచుట, మొదలగునవి హరించును. పైనపూసినయెడల తామరను, తేలు పాము ఎలుక మొదలగు వాటివిషమును కూడ హరించును. జా 1 కి రు 1-0-0.

## —* 221 కర్పూరాదివటి *—

దీనిని కాచి చల్లారిన నీటితోగాని, వాము మొదలగు వానిరసముతోగాని ఉపయోగించినయెడల అతిసారము, గ్రహణి, అజీర్ణము, జిలుబు, గురక మొదలగునవి వెంటనే నశించును. కలరాయందు ప్రధానముగ నుపయోగింపవచ్చును. కోరింతదగ్గులమీదకూడ చాల బాగుగ పనిచేయును. మోతాదు 1,2 మాత్రలు.
మా 50 కి రు 1-0-0.

## —* 222 పంచవక్త్రరసము *—

ఈ మాత్రలను (1) జిల్లేడువేళ్ళు, త్రికటుకములు వీనియొక్క కషాయముతో సన్నిపాతజ్వరములు, దోషజ్వరములు, శీతజ్వరములు (2) తేనెతో దగ్గు, ఆయాసము కఫరోగములు (3) అల్లపురసముతో అజీర్ణములు, అగ్నిమాంద్యము మొదలగువానియందియ్యవలెను. మోతాదు 1,2 మాత్రలు. మా 50 కి రు 0-12-0.

## —* 223 మాణిక్యరసము *—

దీనియొక్క మోతాదు గుణములు మొదలగువానికి నం 183 లో కనిరూపణము చూడుము. దీనికిని దానికిని విశేషభేదములేదు. తు 1కి రు 1-8-0.

—* 224 గోమూత్రశిలాజతు *—

దీనిని ఆవుపాలతోగాని ఆయాకషాయములతోగాని తేనెతోగాని సేవించినయెడల శుక్లనష్టము, మధుమేహము, అతిమూత్రము, పాండువు, అజీర్ణము, ప్రదరవ్యాధులు, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వీనిని నశింపచేయును. వీర్యవృద్ధిని చేయును. ముసలితనమును వ్యాధులను నశింపచేయును. సమస్తమగువ్యాధులు దీనిచే నశించుననియు, దీనిని సేవించునప్పుడు వేడిచేయు వస్తువులను తినకూడదనియు, శాస్త్రమందు చెప్పబడినది. మోతాదు ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు. తు 1 కి రు 3-0-0.

—* 225 నారికేళాంజనము. *—

దీనిని కొద్దిగ కంటియందుపయోగించిన యెడల నీళ్ళుకారుట, పుసికట్టుట, ఎరుపులు, మంటలు, సరిగ కనబడకుండుట, మొదలగునవి నశించును. సీ 1 కి రు 0-8-0.

—* 226 అమృతభల్లాతకి *—

దీనిని ¼ మొ॥ ½ తు॥ వరకు త్రిఫలాకషాయముతో సేవించినయెడల సమస్తమగు కుష్ఠములు, చర్మవ్యాధులు, రక్తదోషములు, వ్రణములు, వెంట్రుకలు నెరయుట, అర్శస్సు, భగందరము, బొల్లి, జీర్ణించిన సవాయివ్యాధులు మొదలగునవి వెంటనే హరించును. తెగిపడిన చెవులు వేళ్ళు ముక్కు కలిగినట్టియు, క్రిములతో కూడినట్టియు, చికిత్సాఫలమునుపొందనట్టియు, కుష్ఠరోగి దీనిసేవనచే, ఎండినవృక్షము వర్షముచే క్రమముగ చిగిర్చి ప్రకాశించురీతి ప్రకాశించును. తు 1 కి రు 2-0-0.

—* 227 భావనజీలకర్ర *—

దీనిని సుమారు పావుతులము చొప్పున నోటిలోనుంచుకొని చప్పరించిన యెడల సమస్తమగు పైత్యవ్యాధులు, అజీర్ణము, అగ్నిమాంద్యము, తలతిరుగుట, నోట నీరూరుట, అరుచి, గ్రహణి, పైత్యదద్దుర్లు, దురద, వాంతి, మలబంధము, వికారముగ నుండుట, ఎక్కిళ్ళు మొదలగునవి వెంటనే హరించును. శే 1 కి రు 1-8-0.

—* 228 భావనశుంఠి *—

దీనిని సుమారు పావుతులముచొప్పున నోటిలోనుంచుకొని చప్పరించిన యెడల అజీర్ణము, కడుపుబ్బరము, త్రేన్పులు, కడుపునొప్పి, అరుచి, సమస్తమగు పైత్యవ్యాధులు, త్రేపులరచుట, మలబంధము, అతిసారము, తలతిరుగుట, నోట నీరూరుట, మొదలగునవి వెంటనేహరించును. శే 1 కి రు 1-4-0.

—* 229 భాండవము *—

దీనిని ¼ మొ॥ 1 చి॥ వరకు చనుపాలతోగాని, ఆముదముతోగాని, తమలపాకు రసముతోగాని, నుపయోగించినయెడల చంటిపిల్లలకుకలుగు అజీర్ణము, కడుపుబ్బరము, మలబంధము, వాంతులు, జలుబు, శ్లేష్మ మెదురుకొనుట, దగ్గు, ఆయాసము, డొక్కలెగరవేయుట మొదలగునవి వెంటనే నశించును. 1 మొ॥ 2 చి॥ వరకు శొంఠి చూర్ణము మొదలగువానితో మాటువగ్గి పెద్దవారల కుపయోగించినయెడల సమస్తమగు వాతవ్యాధులు, అర్ధాంగవాతము, చచ్చువాతము, కీళ్ళనొప్పులు, అజీర్ణము, అతిసారము, శూల, మేహవాతనొప్పులు, జీర్ణించిన సవామేహములు మొదలగునవి హరించును. కలరాయందుకూడ నుపయోగించవచ్చును. తు 1 కి రు 5-0-0.

—* 230 యవాన్యర్కము *—

దీనిని ½ మి॥ 1 ఔ॥ న్సువరకు సమానమగు నీటిలో కలిపి సేవించినయెడల మేహవ్యాధులు, అగ్నిమాంద్యము, నోటిపూత, శుక్లనష్టము, రక్తదోషములు, జ్వరములు, ఉడుకు, తాపము, దప్పిక మొదలగునవి నశించును. ఔ 24 కి రు 0-12-0

—* 231 సుధూర్చిష్టాది లేపము *—

దీనిని కొబ్బరినూనెలో కలిపిపూసినయెడల గురద, పుండ్లు, కాలుపుండ్లు, చిడుము, గజ్జి, శిరస్సునందు పుండ్లు, శరీరము పేలుట, కాళ్ళుపగుళ్ళు, మొదలగునవి నశించును. సవాయిపుండ్లనుగూడ నుపశమింపవచ్చును. గుడ్డకుపూసి పట్టీలుగ వేసినచో వ్రణములు నశించును. నోటికిని కంటికిని తగిలినను ప్రమాదములేదు. కావున పసిపిల్లలకుకూడ పైత్యవ్యాధులయందు నిర్భయముగానుపయోగించవచ్చును. సీ 1కి రు 0-8-0.

—* 232 తామ్రిలోహరసాయనము *—

దీనిని (1) గంటుభారంగి, పిప్పళ్ళు, లవంగాలు, సొంఠి వీనియొక్క కషాయముతో శ్లేష్మసంబంధమగు దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మవ్యాధులు, శ్లేష్మప్రకోపము (2) రెట్టింపు ఫిరంగిచెక్క చూర్ణముతో కుష్ఠములు, చర్మవ్యాధులు, వాతవ్యాధులు, (3) సోపు, మిరియాలు, తుత్తురబెండవేళ్ళు వీనియొక్క కషాయముతో అజీర్ణము, శూల, కడుపుబ్బరము, (4) తేనెలో పాండువు, కామిల్లి, నంజు, తిమ్మిర్లు, ఉదరము, వీనియందియ్యవలయును. మోతాదు ¼ మి॥ ½ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

—* 233 రజతమేహనంగరాజీయము *—

దీనిని (1) ద్రాక్షపండ్ల రసముతో మేహవ్యాధులు, నోటిపూత, పైత్యవ్యాధులు, (2) వెన్నతో శుక్లనష్టము, శీఘ్రస్ఖలనము, శుక్రము పలచగనుండుట, నడుమునొప్పులు, కాళ్ళులాగుట, దగ్గు, బలహీనత, శ్వేతరక్తప్రదరములు, (3) కలుబందగుజ్జుతో సెగవ్యాధులు, మూత్రనాళమందలి మంట, వీనియందియ్యవలయును. ఇందు వంగము నెండియుకూడ ప్రధానముగ కలియుటచే మేహవ్యాధులయందు మోఘముగా పనిచేయును. మోతాదు ¼ మి॥ ½ చి॥ వరకు. తు 1 కి రు 5-0-0.

—* 234 మహాకామసంజీవనీరసము *—

ఈమందు అమోఘముగా పనిచేయునని అనేకమంది అనేక విధములుగ పొగడియున్నారు. ఈయోగమును మేము అనేక వ్యయప్రయాసలకు లోనై సంపాదించి అందరికి తెలియునట్లు ప్రచురించితిమి. మాస్నేహితులనేకమంది యొక్క ప్రోత్సాహముచే మేముస్వయముగ బహుశ్రద్ధగ దీనిని తయారుచేసితిమి. ఇందుచెప్పబడిన గుణములనన్నిటికిని అమోఘముగ పనిచేయుచున్నది. జాజికాయలు, జాపత్రి, చందనంపొట్టు, లవంగాలు, ఏలక్కాయలు, పిప్పళ్ళు, వీనిని సమభాగములుగ గ్రహించి చూర్ణముచేసి, మాత్రకు 3 రెట్లు గ్రహించి, ఆచూర్ణముతో సమానముగు పంచదారను గ్రహించి యారెండిటిని కలపి అందుకొద్దిగ తేనెవేసిముద్దగచేసి దానిని మాత్రచుట్టునుపొదగి అరటిపండు ముక్కయందుంచి రాత్రిపరుండునప్పుడు పుచ్చుకొనవలెను. ఈవిధానమంతయు సందర్భము కానియెడల వీలుఅయినంతవరకు

చేయవలెను. లేదా వట్టిమాత్రను వేసుకొని కొద్దిగ ఆవుపాలు త్రాగవలెను. ఆవుపాలుకూడ సందర్భముకానియెడల చన్నీటినే కొద్దిగ త్రాగవలెను. దీనిసేవనచే గుఱ్ఱపుదండమువలె నివారింపశక్యముగాని దండము (అంగము) కలవాడై మన్మథోద్రేకముతో మదించిన గొప్ప ఏనుగువలె ఎల్లప్పుడును మహాగాఢమైన రతినిచేయుటయందు సామర్థ్యము కలవాడై మూడుజాములలో నూర్గురు స్త్రీలను రమించి జయించును. పంచదారవేయబడిన పాలను తప్పకత్రాగవలయును. పచ్చకర్పూరముతో కూడిన తాంబూలము నెల్లప్పుడు సేవించవలయును. ఈయౌషధము వృద్ధులకుకూడ వీర్యస్తంభనము చేయును. నిమ్మకాయరసమునుగాని పుల్లనిపండ్లయొక్క రసమునుగాని నోటియందుంచకొనినచో క్షణకాలములో నీమందు యొక్క ఉద్రేకము నశించును. మరియు దీనిని రాజౌషధముగ అనగా సందర్భానుసారముగ కొంతకాలము సేవించినయెడల లింగము కృశించుట, నపుంసకత్వము, లింగదోషములు, నడుమునొప్పి, శుక్రదోషములు, ఇరువదిప్రమేహములు, ఏకాదశక్షయములు, అగ్నిమాంద్యము, గ్రహణీవ్యాధులు, అజీర్ణము, దగ్గు, అతిమూత్రము, మధుమేహము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, బలహీనత మొదలగునవి నశించును. దీనిని బహుజాగరూకత గలవాడై సమస్తవ్యాధులయందును ప్రయోగింపవలయును. మోతాదు 1 మొదలు 2 మా॥ వరకు. తు1కి రు 16-0-0

—* 235 కఫచింతామణి. *—

దీనిని (1) నల్లేరురసముతో కఫమెక్కువై ప్రాణాపాయస్థితియందుండుట, దగ్గు, గురక, ఆయాసము, కఫముఅడ్డుపడుట, క్షయ, శ్లేష్మవ్యాధులు, (2) మోడీరసముతో వాతవ్యాధులు, (3) తమలపాకులరసము మొదలగువానితో చంటిపిల్లలకు కలుగు శ్లేష్మవ్యాధులు మొదలగువానియందియ్యవలయును. చక్కని వేడిమిని వెంటనే కలిగించును. మోతాదు $\frac{1}{8}$ మొ॥ $\frac{1}{4}$ చి॥వరకు. తు 1కి రు10-0-0

—* 236 పాషాణవాతరాక్షసము *—

ఇది (1) అల్లపురసముతో పదమూడు సన్నిపాతములు, దోషజ్వరములు, శీతపైత్యజ్వరములు, (2) నల్లఉప్పిచెక్కరసముతో సూతికాజ్వరములు, సూతికావాతములు (3) నేలగొలిమిడివేళ్ళరసముతో అర్దితవాతము, పక్షవాతము, సర్వాంగవాతము, చచ్చువాతము, కంపవాతము, మొదలగువానిని వెంటనే నశింపచేయును. ఇందు ఉల్లిపాషాణము చేరుటచే పైవ్యాధులయందు చురుకుగ బహుచక్కగ పనిచేయునని వేరుగ వ్రాయనవసరములేదు. మోతాదు $\frac{1}{8}$ మొ॥ $\frac{1}{4}$ చి॥వరకు. తు1కి రు 3-0-0.

—* 237 కృమిముద్గరరసము *—

దీనిని తేనెతో సేవించి వెంటనే తుంగగడ్డలు లేక వాము కషాయమును త్రాగినయెడల సమస్తమగు క్రిములును, క్రిములవలన కలిగినవ్యాధులును, అజీర్ణము మొదలగునవియు నశించును. మోతాదు $\frac{1}{4}$ మొ॥ 1 చి॥వరకు. తు 1కి రు 1-8-0.

## —* 238 ప్రతాపలంకేశ్వరము *—

దీనిని (1) అల్లపురసముతో సూతికావాతములు, సూతికాజ్వరములు, (2) త్రిప్పతీగ, అల్లము, త్రిఫలములు వీనియొక్క కషాయము గుగ్గులు వీనితో వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, అర్శస్సు, (3) శొంఠిరసముతో సన్నిపాతజ్వరములు, కఠినజ్వరములు, గ్రహణి, అజీర్ణము, శ్లేష్మదగ్గు, ఆయాసము, అతిసారము వీనియం దియ్యవలయును. మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ చి॥వరకు. తు 1కి రు 3-0-0.

## —* 239 కంచుభస్మ. *—

దీనిని (1)కరక్కాయగంధముతోగాని తేనెతోగాని యిచ్చినయెడల శ్లేష్మసంబంధమగు దగ్గు, ఆయాసము, క్షయ, శ్లేష్మప్రకోపము, వాతవ్యాధులు, అజీర్ణము మొదలగునవి హరించును. మోతాదు $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 3-0-0

## —* 240 సారస్వతచూర్ణము (బృహత్). *—

దీనిని $\frac{1}{12}$ మొ॥ $\frac{1}{6}$ తు॥ వరకు తేనెతోగాని నేతితోగాని సేవించినయెడల మంచి స్వరమును, మనోధైర్యమును, బుద్ధికుశలతయు, కవనశక్తియు కలుగును. ఈ సారస్వతచూర్ణము బుద్ధికుశలత లేనట్టియు, మనస్సు సరిగ లేనట్టియు ప్రజలయొక్క హితము కొరకు బ్రహ్మచే స్వయముగ చెప్పబడినది. పా 1కి రు 5-0-0.

## —* 241 రోహితకారిష్టము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ ఔన్సువరకు రెట్టింపునీటిలో కలిపి సేవించినయెడల సమస్తమగు ప్లీహవ్యాధులు, గుల్మము, ఉదరము, అష్ఠీలావ్యాధి, గ్రహణి, అర్శస్సు, కామిల, కుష్టము, నంజు, అరుచి, మొదలగునవి నశించును. పా 1కి రు 1-8-0

## —* 242 మహాభల్లాతక లేహము *—

దీనిని $\frac{1}{4}$ మొ॥ $\frac{1}{2}$ తు॥ వరకు తిప్పతీగ కషాయముతోగాని ఆవుపాలతోగాని సేవించినయెడల బొల్లి, సమస్తమగు కుష్టములు, దురద, దద్దుర్లు, జీర్ణించినసవాయి వ్యాధులు, సమస్తమగు చర్మవ్యాధులు, వ్రణములు, క్రిమివ్యాధులు, శూలవ్యాధి, దగ్గు, ఆయాసము, భగందరము, జీర్ణించిన సెగవ్యాధులు, వెంట్రుకలు నెరయుట, మొదలగునవి వెంటనే హరించును. పా 1కి రు 3-0-0.

## —* 243 దద్రుహర తైలము (తామర తైలము) *—

దీనిని తామరగల ప్రదేశమందు పిడక మొదలగువానితో బాగుగా గోకి దూది చుట్టిన పుడక మొదలగువానితో పూసినయెడల తామర వెంటనే హరించును. మరియు చిడుము, గజ్జిపుండ్లు, దురద, చర్మవ్యాధులు మొదలగునవికూడ వెంటనే హరించును. పైవ్యాధులను హరించుటలో అత్యుత్తమమైనదని స్వానుభవముచే చెప్పగలము. చాలదినములనుండి యున్నవ్యాధికూడ నశించును. సీ 1కి రు 0-12-0.

## —* 244 శృంగ [శృంగి] భస్మ *—

ఇది (1) తేనెతో శ్లేష్మదగ్గు, ఆయాసము, గొంతుకలో వుండపెట్టినట్లుండుట, వాతవ్యాధులు, (2) నేతితో గుండెవ్యాధులు, శూల, పరిణామశూల, అజీర్ణము, గ్రహణి, అతిసారము, ఉదరము, (3) వెన్నతో ప్రదరవ్యాధులు, (4) పటి

కబెల్లపుచూర్ణముతో పాడిదగ్గు వీనిని నశింపజేయును. కీళ్ళలుమీద బహుచక్కగ పనిచేయును. మోతాదు ½ మొ॥ 1 చి॥వరకు. తు 1కి రు 0-8-0.

## —* 245 అఫేనాదివటి *—

దీనిని రెండేసిమాత్రలు చొ॥ ఉదయము సాయంకాలము దాచెన చెక్కరసముతోడను, మధ్యాహ్నము రాత్రియు చన్నీటితోడను కలిపియిచ్చినయెడల ఎట్టి ఉద్ధృతస్థితిలోనున్నను జిగట (బంక) విరేచనములుగాని, రక్తవిరేచనములుగాని వెంటనే శమించును. ఒకరోజునకే మంచిగుణము కలుగును. దీనిని సేవించునప్పుడు అన్నము మాని జావలు తీసుకొనుట శ్రేష్ఠము ఇందు నల్లమందు కొద్దిగ కలియును. మా 50 కి రు 1-0-0

## —* 246 త్రిఫలాఘృతము *—

దీనిని ¼ తు॥ మొ॥ ¾ తు॥ వరకు పంచదారతోగాని, పాలతోగాని కేవలముగ గాని సేవించినయెడల నీళ్ళుకారుట, ఎర్రగనుండుట, మండుట, పుసికట్టుట, వెలుతురును చూడనిష్టపడకుండుట, మసకగనుండుట, పొరకమ్ముట మొదలగు నేత్రవ్యాధులన్నియును నశించును. నేత్రవ్యాధులను నశింపచేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనదని ఆయుర్వేదమందు స్పష్టముగ చెప్పబడినది. ప్రదరములు, రక్తదోషములు, వ్రేటుకలు నెరయుట, విసర్పము వీనిని కూడ నశింపజేయును. ఔ 4 కి రు 1-4-0

## —* 247 సువర్ణమేహవంగరాజీయము. *—

దీనికి కేవల పేరుమాత్రమే గాదు. ఇందు బంగారము కలిసినది. కొంతమంది కోరికపై దీనిని తయారుచేసితిమి. అమోఘముగ పనిచేయును. స్వర్ణవంగమునను గాని మేహవంగ రాజీయమునను గాని రజతమేహ వంగరాజీయమునను గాని చెప్పబడిన అనుపానములతో ఆయా వ్యాధులయందు బహుచక్కగ పనిచేయును. సువర్ణము కలయుటచే వీర్యవృద్ధి, నరములపటుత్వము మొదలగువానిని కూడ కలిగించును. మరియు క్షయ, అతిమూత్రము మొదలగువానిని కూడ నశింపచేయును. సువర్ణము కలిసినమందు లభించుట దుర్లభము. మోతాదు ¼ మొ॥ ½ చి॥ వరకు. తు 1 కి రు 12-0-0

## —* 248 శ్లేష్మవిధ్వంసి. *—

దీనిని నేలములగ లేక అడ్డసరపు రసముతో నుపయోగించినయెడల దగ్గు, ఆయాసము, క్షయ, కాసశ్వాస, శ్లేష్మప్రకోపము మొదలగు శ్లేష్మవ్యాధులు వెంటనే నశించును. మోతాదు ¼ మొ॥ చి॥ వరకు. తు 1 కి రు 3-0-0.

## —* 249 ప్రదరారిరసము *—

దీనిని అశోకపట్టకషాయముతో సేవించినయెడల శ్వేతప్రదరమును, రక్తప్రదరమును, వెంటనే నశించును. అశోకపట్ట, తిప్పతీగ, [illegible] పాలపట్ట, రసాంజనము, తుంగగడ్డలు, ఎర్రచందనము వీనియొక్క కషాయముతో సేవించినయెడల రక్తస్రావము, జ్వరము, అతిమూత్రము, శ్వేతప్రదరములు, రక్తప్రదరములు మొదలగునవి వెంటనే నశించును. మోతాదు 1-2 మాత్రలు. తు 1 కి రు 3-0-0.

## —* 250 వ్యాధిహరణరసము *—

దీనిని తేనెతోగాని ఇతర అనుపానములతోగాని సేవించినయెడల [illegible], ముఖ

వాపిక, మచ్చలు, పొక్కుసవాయి మొదలగు సమస్తసవాయివ్యాధులను హరించును. సవాయివ్యాధులు జీర్ణించుటచే కలిగినదుర్లక్షణముల నన్నిటిని తగ్గించును. సవాయివ్యాధిజీర్ణించుటచే కలిగిన నపుంసకత్వమునకు అమోఘముగా పనిచేయును. ఇప్పటికాలములో సంతానము కలుగకుండుటకుగాని కలిగినసంతానము వెంటనే నశించుటకుగాని, సవాయివ్యాధులే చాలవరకు కారణము. అట్టివ్యాధులను మొదలంట నశింపజేసి సంతానమును కలిగించుటయేగాక కలిగినసంతానము నశింపకుండకూడ చేయును. తమలపాకుల రసముతో నుపయోగించినయెడల వాతశ్లేష్మవ్యాధులు, శూలలు, బాలురకుకలుగు శ్లేష్మజాతివ్యాధులు మొదలగువానినికూడ నశింపచేయును. ఈకాలమున దీనిని చాలామంది వాడవచ్చును.

మోతాదు $\frac{1}{8}$ మొ॥ $\frac{1}{2}$ చి॥ వరకు. తు 1కి రు 4-0-0.

సూచన:—పైన వ్రాసిన యౌషధములేకాక నింకను మావికొన్ని యౌషధములు మావద్దకలవు. మిక్కిలి సరసమయిన ధరలకిచ్చెదము.

సూచన:—ఒక్కొక్కవ్యాధియొక్క లక్షణములను క్రమముగ ఎత్తుకొనుచు దేశకాలతత్వాదులనుబట్టి ఒక్కొక్క లక్షణమునకే అనుపానములు వ్రాయబూనినచో నొకమందునుగూర్చి నొక పెద్దపుస్తకము వ్రాసినను చాలదు. శాస్త్రాభిప్రాయమునకు అంతములేదు. అందుచేతను, మా ఆయుర్వేదౌషధరత్నాకరముయొక్క ద్వితీయముద్రణములో అనుపానములయొక్క ఉద్దేశములు, సేవనాదకములు, మొదలగు ననేకసంగతులు విమర్శించి వ్రాసియుండుటచేతను ఇంతకంటె వ్రాయుట అనవసరమని తలంచి మార్గదర్శకముగ మాత్రము వ్రాస్తిమి.

జ్ఞప్తి—ఆంధ్రదేశమందలి ప్రసిద్ధప్రక్రియలన్నిటిని మేము గ్రంథముల రూపముగ వ్రాసినసంగతి అందరికిని తెలిసినసంగతియే. ఈకేట్లాగునందలి ప్రక్రియలన్నియు మామూడు గ్రంథములయందును కలవు. రసౌషధములన్నియు ఆయుర్వేదౌషధరత్నాకరమునందును ఆసవఅరిష్టచూర్ణలేహఘృతతైలాదులన్నియు ఆంధ్రభైషజ్యరత్నావళియందును, భస్మలు తామ్రమైనము గంధకపుష్పము మొదలగునవన్నియు భస్మప్రకాశికయందును కలవు. కాన ఈమూడుపుస్తకములను చూచినచో మా కేట్లాగునందలి ప్రక్రియలన్నియు, మందుయందు కలయువస్తువులు ప్రక్రియావిధానము గుణములు మొదలగు వానిలో తేటతెల్లముగ ప్రతివారికిని తెలియగలవు. మరియు మేము క్రొత్తగ వ్రాసిన అనుభవదీపికను చూచినచో ఏవస్తువులు ఎప్పుడు ఎట్లు చేర్చినదియు ఏగంటలో మొదలుపెట్టి ఏగంటలో ఎట్లుచేసినదియు మొదలగు సంగతులు తెలియగలవు. కాన ప్రతి ఔషధమువద్దను పుస్తకముపేరు మొదలగునవింకను వివరముగ వ్రాయలేదు.

---

## అనుపాన విశేషములు.

1. కషాయమునకు చెప్పబడిన ద్రవ్యములను మెత్తగ నలియకొట్టి సుమారు 5, 6 రెట్లు నీళ్ళనుపోసి సుమారు నాల్గవవంతు మిగులునట్లుగ కాచవలెను. చల్లారిన

పిదప కావలసిన పరిమితిగ వడకట్టుకొనవలయును. మిగిలినది ఆవస్తువులతో అటులే యుంచవలయును. ప్రతిరోజు కషాయము క్రొత్తగ చేసుకొనుచుండుట మంచిది. లేదా ఆ కషాయము మూడురోజులవరకు నుపయోగింపవచ్చును. అయిదురోజులవరకుకూడ నుపయోగించుట సామాన్యపక్షము. 3 లేక 5 రోజులు వుంచునేయెడల ప్రతిరోజు వుదయము ఒకసారి కొద్దిగ వెచ్చచేయుచుండవలయును. లేనిచో బూజు కట్టి చెడిపోవును. ఉదయము వెచ్చపెట్టిన కషాయమును మరల వెచ్చపెట్టకుండగనే రాత్రి పరుండువరకు నుపయోగింపవచ్చును. అయిదురోజులు అయినపిదప మరల క్రొత్తకషాయము పెట్టుకొనవలయును. కషాయము కాచునప్పుడు పైన మూతపెట్టకూడదు. ఇతరసమయములలో మూత తప్పకయుండవలయును. కషాయమును క్రొత్తకుండలో పెట్టుకొనుట మంచిది. మోతాదు 3, 4, 5 తులములవరకు.

2. చూర్ణములు, మాత్రలు, భస్మములు, మెత్తగచేయబడిన రసౌషధములు మొదలగు వానిని నోటిలో వేసుకొని మ్రింగి, వెంటనే కషాయము మొదలగు ద్రవానుపానమును త్రాగవచ్చును. లేదా దానిలో కలుపుకొని త్రాగవచ్చును.

3. ఆయారసములు వేసి ఆయామాత్రలు మొదలగునవి కట్టుకొనమని చెప్పినప్పుడు కొద్దిగరసమును పోయుచు అన్నియు కలసి మెత్తనగువరకు మర్దించి అసలు మందుయొక్క మోతాదునసరిపోవునట్లు మాత్రలు మొదలగువానిని చేసుకొనవలయును.

4. వసంతకుసుమాకరము మొదలగువానిని మాత్రలు చేయునప్పుడు చేతికి అంటుచున్నయెడల త్రిఫలాచూర్ణము మొదలగువానిని చేతికి పూసుకొనవచ్చును.

5. క్రవ్యాది మొదలగువానిని మాత్రలుగచేసి సీసాలో వేసినప్పుడు కలసి ముద్దగ అగునని తోచినచో అందు త్రికటుచూర్ణము మొదలగువానిని చల్లవలయును.

6. కషాయమునకు చెప్పబడిన ద్రవ్యమునకు పరిమితి చెప్పనియెడల, ఆకషాయము ఎన్నిదినములకు నుపయోగింపదలచిరో ఆదినములనుబట్టియు, వస్తుసముదాయమునుబట్టియు వకొక్కటి సుమారు 5-6 తులములచొప్పున గ్రహించవలయును.

7 వేడినీళ్ళు, పాలు, మొదలగు సామాన్యఅనుపానములు చెప్పినప్పుడు గ్రుక్కెడు వేడినీళ్లు పావుసేరు లేక పావుసేరులో సగము ఆవుపాలు ఇట్లు యుక్తినిబట్టి గ్రహింపవలయును.

8. ఈ మందు ఈమోతాదులో వాడమని చెప్పినప్పుడు వ్యాధిస్వభావమును బట్టియు, మందుయొక్క స్వభావమునుబట్టియు రోజుకు 2-3-4-5-6 సార్లువాడవలెను.

9. మాత్రలు మొదలగు కొన్నిటికి ద్రవానుపానము చెప్పనియెడల కొద్దిగా వేడినీటినిగాని చన్నీటినిగాని అనుపానముగా నుపయోగింపవచ్చును.

10. మేము వ్రాసిన అనుపానదినుసులలో, కొన్ని దొరకనియెడల వానికిసమానగుణముగల వస్తువులను చేర్చుకొనవలయును. లేదా ఆవస్తువును మాని మిగతా వస్తువులను గ్రహింపవలయును. సరిగ గ్రహించుటయే శ్రేష్టము.

11. 2, 3, 4, వస్తువులు చెప్పి 2,3 రెట్లు అని చెప్పినప్పుడు అన్నిటియొక్క చూర్ణమును కలిపియే 2, 3 రెట్లు అని గ్రహింపవలయును.

12. తేనె, నెయ్యి. పంచదార మొదలగు అనుపానములను మందు బాగుగ

కలయునంతవరకు నుపయోగించవలయును.

13. మేము వ్రాసిన అనుపానములు ఏకారణముచేతనైనను సందర్భపడనియెడల సామాన్యముగ సందర్భపడు తేనె, నెయ్యి, పంచదార, వెన్న, జలము మొదలగు అనుపానములతో వాడవలయును.

14. మేము వ్రాసిన అనుపానములను దేశకాలతత్వాదులను బట్టిమార్చి వేరు విధముగ పరికల్పించుకొనవచ్చును.

15. మేము మామందులయొక్క స్వభావమునుబట్టి అనుపానములను వ్రాసితిమి కాన ఈఅనుపానములను ఇంకొకరిమందులకు సమకూర్చుట అంతమంచిదికాదు.

16. మందులకు చివరున చెప్పబడిన ¼ చి॥ ½ చి॥ మొదలగు మోతాదులు అసలుమందునకే. అనుపానచూర్ణములతో కూడినదానికికాదు.

17. ఏదైన నొకమందును ఏకతులము నుపయోగించ దలచుకొన్నను అంత మందును ఏకేసారి పొట్లములు కట్టుటకంటే సుమారు పావుతులము చొప్పున కట్టుకొనుచుండుట అనేకవిధముల మంచిది.

18. రసౌషధములు, భస్మలు, చూర్ణములు, ఆసవారిష్టములు మొదలగువానిని వ్యాధుల ననుసరించి 2-3-4 రకములను యేకముగ కలుపుకొని వాడవచ్చును. ఎన్నికలిపినను మోతాదుమాత్రము ఏకమందునకుండు మోతాదుకంటె విశేషము హెచ్చకూడదు.

19. ఒకపూట ఒక అనుపానముతోడను ఇంకొకపూట ఇంకొక అనుపానముతోడను లేక ఒకపూట కేవలము మందును ఇట్లు వాడవచ్చును.

20. కొన్నిసార్లు రసౌషధాదులను కొన్నిసార్లు ఆసవారిష్టాదులనువాడవచ్చును.

21. అల్లము, ఎండుఖర్జూరపుకాయలు మొదలగు వానియొక్క గంధములను అనుపానముగ చెప్పినప్పుడు వానిని నీటితో సానమీద గంధముగ అరగతీసి అందు మందును కలిపియివ్వవలయును.

22. ¼ చి॥ మొ॥ ½ చి॥ వరకు అని సామాన్యముగ చెప్పినప్పుడు ఆరెండిటిలో నొకదానినిగాని ఆరెండింటికి మధ్యలోగాని మోతాదును పరికల్పించుకొనవచ్చును.

23. మేము చెప్పిన మోతాదునకు రోగతత్వాదులనుబట్టి కొంచెము హెచ్చుగాగాని తక్కువగాగాని మోతాదును నిర్ధారణ చేసికొనవచ్చును.

24. మామందులలో నొకదానియొక్క అనుపానమును ఇంకొకదానికి యుక్తినిపట్టిఅనగా ఆయాలక్షణములనుబట్టియు, సందర్భమునుబట్టియు, చేర్చుకొనవచ్చును. (అందుచేతనే ప్రతిమందునకును ఇంకను అనేక అనుపానములు వ్రాయలేదు.)

25. పత్రిపట్టె తిప్పతీగ మొదలగు పచ్చిగనుండు ద్రవ్యములను, కషాయములకు పచ్చివిగను చూర్ణములకు ఎండువిగను నుపయోగింపవలయును.

26. అనుపాన చూర్ణములకుగాని కషాయములకుగాని కొన్నివస్తువులను చెప్పి వానికి భాగములుచెప్పకపోయినప్పుడు వానిని సమభాగములుగనే గ్రహింపవలెను.

27. అల్లము, జీలకర్ర మొదలగువానియొక్క రసములను చెప్పినప్పుడు— వానిని కొద్దిగ నిప్పుపోసి నూరి, 2-3 పొంగులు రానిచ్చిగాని వట్టిదేగాని వడకట్టి అరసము నుపయోగించవలయును. మోతాదు 2-3 తులములు.

28. పొట్లములు మొదలగువానిని ఏమోతాదున కా మోతాదు కట్టుకొనుట కంటె $\frac{1}{8}$ లేక $\frac{1}{4}$ తులంచొప్పున వానికి చెప్పబడిన ఆయారెట్ల ద్రవ్యములతో గాని వట్టివేగాని, వకేదఫా కట్టుకొనుట మంచిది.

29. గట్టిగనుండు కొంతవల్లభరసము మొదలగువానిని మొదట మెత్తగనూరి పిదప అనుపానమార్గమును చేర్చి పొట్లములను కట్టవలయును.

30. వసంతకుసుమాకరము, ఆనందభైరవి మొదలగు మందులను మాత్రలుగ కట్టునప్పుడుగాని వాతవిధ్వంసి మొదలగుమందులను ముద్దగ మర్దించి మాత్రలుకట్టునప్పుడుగాని వకతులము కట్టదలచినచో నాలుగు లేక ఆరు లేక ఎనిమిది ముద్దలుగ చేసి తులము ఎన్నిమాత్రలు కట్టదలంచితిమో దానికి తగినట్లు వక్కొక ముద్దను 17-15-11 మొదలు గాగల మాత్రలుగ చేసికొన్నచో హెచ్చుతగ్గులును క్రమయు లేకుండ అన్నిమాత్రలు సరిగా రాగలవు. పొట్లముల విషయమైకూడ ఇట్టి విభాగము చేసికొనుట మంచిదే.

31. మందులు,ఒకపూటఒకరకముఇంకొకపూటయింకొకరకముయియ్యవచ్చును.

32. చాలదినములు వాడదలచిన సువర్ణసూర్యావర్తి, రజతలోహ రసాయనము మొదలగు కొన్ని మందులను కొందరు ఆయా అనుపానములతో అరగదీసి యిచ్చెదరు. మెత్తగ గంధమువలె అరగి పుచ్చుకొనుటవ శ్రేష్ఠముగానేయుండును కాని ఉజ్జాయింపుగ అరగదీయబడుటచే మోతాదులో కొంత హెచ్చుతగ్గులు కలుగవచ్చును. కాన సమానమగు పొట్లములుగ కట్టి ఉపయోగించుటయే శ్రేష్ఠము.

33. కొంతవల్లభరసము, సువర్ణసూర్యావర్తి మొదలగు మందులయొక్క పొట్లములను ఎప్పటికప్పుడు కొద్దిగా నూరుకొనుచుండుటకంటే, 1, 2 తులములు నూరి వుంచుకొని దానినుండి కావలసినది పొట్లములనిమిత్తముపయోగించుకొనుట మంచిది.

# పథ్యాపథ్యములు.

భుజింపదగినవి:— పొట్లకాయ, బీరకాయ, ఆనప (సొర) కాయ, దోసకాయ, పెండలము, పెరుగుతోటకూర, మెంతికూర, ఆవుపాలు, పాతచింతకాయ పచ్చడి, పాలనిమ్మకాయ ఊరకాయ మొదలగునవి.

అప్పుడప్పుడు భుజింపదగినవి:— మెత్తగానుడికిన కందిపప్పు, తీగ దొండకాయ, బంగాళాదుంపలు, చారు మొదలగునవి.

భుజింపకూడనవి:— వంకాయ, గోంగూర, కంద, అరటికాయ, నూనె, ఆవ, బచ్చలి, గోరుచిక్కుడుకాయ, కొయ్యతోటకూర, బెండకాయ, పెరుగు, సెనగపప్పుతో చేయబడినవి, విశేషమగు కారము, విశేషముగు చింతపండుపులుసు మొదలైనవి.

జావలు:— సగ్గుబియ్యపుజావ, గోధుమనూకజావ, బియ్యముకొద్దిగా వేయించి విసరబడినసూకలజావ, మొదలగునవి. వానిని వ్యాధినిబట్టియు తత్త్వాదులను బట్టియు సేవింపవలయును. జ్వరముయొక్క ప్రారంభస్థితిలోను తీక్ష్ణకోశము బల

హీనముగ నున్నప్పుడును, జావలయొక్క పైతేటనే ఉపయోగింపవలయును. ఆవు పాలను కలపిగాని కలపకగాని ఉపయోగింపవచ్చును. తీపికోరినచో కొద్దిగా పటిక బెల్లపు చూర్ణమును వేయవలయును. పాలు పోసినచో ఉప్పును వేయగూడదు. జావలనుసేవించునపుడు పాతచింతకాయపచ్చడి మొదలగువాని నుపయోగించుట శ్రేష్ఠము కాదు.

గంధకభస్మ, గంధకరసాయనము, గంధకపుష్పము మొదలగు గంధక ప్రధానమగు ఔషధములను సేవించునప్పుడు నూనె, ఆవ, వంకాయ, చింతపండు పులుపు, విశేషకారము మొదలగు పైత్యమును వేడియుచేయువస్తువులను సేవింపకూడదు.

ఇచ్ఛాపథ్యమనగా నూనె, ఆవ, కంద, అరటికాయ, గోంగూర, వంకాయ, విశేషము చింతపండు, విశేషము కారము, పెరుగు, బచ్చలి, గుమ్మడి మొదలగు కేవలము వేడిచేయువస్తువులనుగాని కేవలము చలువచేయు వస్తువులనుగాని కాకుండ సమశీతమగు వస్తువులను వ్యాధిని సత్వమును బట్టి భుజింపవలయునని కొందరిమతము. ఆయా వ్యాధులకును, సత్వములకును సరిపోవు ఆహారవిహారములను ఆచరింపచేయుటయే యిచ్ఛాపథ్యమని మామతము.

విషయము:—పైన వ్రాసిన పథ్యాపథ్యములు సామాన్యదృష్టితో వ్రాయబడినవి. ఒక్కొక్కప్పుడు వ్యాధిననుసరించి పైపథ్యములు కొన్ని అపథ్యములుగను అపథ్యములు కొన్ని పథ్యములుగను నుండవచ్చును. ఉదాహరణము—వాతవ్యాధియందు అనపకాయ అపథ్యముగను కంద పథ్యముగను యుండవచ్చును. మరియు వస్తువులను సామాన్యముగ చెప్పినను వాటియొక్క భేదముననుసరించి గుణభేదముండునని తెలిసికొనవలయును. ఉదాహరణము—పెద్దదోసకాయ గుణము వేరు. చిన్నదోసకాయ గుణము వేరు. కాలమునుబట్టియు దేశమునుబట్టియు చిన్న దోసకాయయందుకూడ గుణభేదములు కలవు. మరియు పాకభేదమును వస్తుసంయోగభేదమును అనుసరించి గుణభేదముండును. ఉదాహరణము-మినుముతో తయారుచేయబడినగారెలు గుణము వేరు. మేహవాతములను హరించును. బియ్యపుపిండికలిపి నీటిఆవిరిమీదను ఉడికించిన మినపకుడుము (ఇడ్డెను) గుణము వేరు. మేహశాంతిచేయును. బియ్యపుపిండి కలిపి కాల్చిన మినపరొట్టె గుణము వేరు. వేడిని మందముగ చేయును. ఇట్టి గుణభేదముల నన్నిటిని సమన్వయించుకొనుచు పథ్యాపథ్యములను నిర్ణయము చేయవలయును.

### —* పారిభాషికపదముల కర్థము *—

1. త్రిఫలములు:—కరక్కాయ, తానికాయ, ఉసిరికపప్పు.
2. త్రికటుకములు:—శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు.
3. చాతుర్జాతకములు:—దాసెనచెక్క, ఏలక్కాయలు, ఆకుపత్రి, నాగకేసరములు.
4. త్రిజాతకములు:—దాసెనచెక్క, ఏలక్కాయలు, ఆకుపత్రి.

సూచన:—సితోపలాదిచూర్ణము మొదలగునవి కొన్ని అనుపానచూర్ణములలో చెప్పబడియున్నయెడల వాని విధానమును మా ఆంధ్రభైషజ్యరత్నావళిలో చూడుడు.

## —* ఇతరవిషయములు *—

(1) మందులకు ఖరీదులను వేయునప్పుడు ఉజ్జాయింపుగ వేయలేదు. ఆయా మందులకగు వ్యయము (ఖర్చు)ను ప్రత్యేకముగ వ్రాసి గమనించి కిట్టుబాటునుబట్టి సరియైన ఖరీదులను వేసితిమి. అందుచే మా మందుల ఖరీదులు సరిగ నుండగలవు.

(2) అనేకమంది, ఫలానిమందులను పంపమని వ్రాయుచు వాని పథ్యమును కూడ వ్రాయుడు అని వ్రాసెదరు. సామాన్యముగ పథ్యమనునది రోగమునుబట్టియుండును గాని మందునుబట్టియుండుట బహుఅరుదు, అందుచే మందునుబట్టి పథ్యమును వ్రాయుటకు వీలులేదు. అందుచేతనే ఈకేటలాగునందు పథ్యములు వ్రాయబూనలేదు. పథ్యమును రోగతత్వాదులనుబట్టి చేయింపవలెను.

(3) మందులయొక్క రంగు, బరువు, చిక్కన, పలచనిసము, రుచిమొదలగువానినిబట్టి మందులయొక్క మంచిచెడ్డలను నిర్ణయించుటకు వీలులేదు. శాస్త్రవిరుద్ధముగ తయారుచేయబడినవే వక్కొక్కప్పుడు పైకి అనేకవిధములుగ బాగుండవచ్చును. వస్తువులను భాగప్రకారము తూచి చూర్ణించి వేసి తయారుచేయబడిన సువర్ణమూర్త్యావర్తిరగు వేరు. చూర్ణించినవస్తువులనే తూచి వేసి తయారు చేయబడిన సువర్ణమూర్త్యావర్తిరంగు వేరు. మిరియాలను భాగప్రకారం తూచి వస్త్రకాళితము చేసి వేసి తయారుచేసిన లోకనాథము బరువువేరు. మిరియాలను వస్త్రకాళితము చేసినపిదప తూచివేసి తయారుచేసిన లోకనాథముబరువు వేరు. శాస్త్రమందు చెప్పబడినప్రకారము వక్కొక రసముచే మూడేసిరోజులు మర్దనచేసిన సన్నిపాతభైరవియొక్క మెత్తదనము వేరు. గుణాధిక్యము కలుగును గదా యని వక్కొక రసముచే చాలదినములు మర్దనచేసిన సన్నిపాతభైరవియొక్క మెత్తదనము వేరు. ఒకసాంప్రదాయప్రకారము తయారుచేయబడిన ఆసవారిష్టములు పలచగను ఇంకొక సాంప్రదాయముగ తయారుచేయబడిన అసవారిష్టములు చిక్కగను వుండును. కాన మంచిచెడ్డలను సామాన్యముగ నిర్ణయించుటకు వీలులేదు. గుణమునుబట్టియే నిర్ణయింపవలెను.

(4) మందును నిర్ణయింపవలసినదిగ వ్రాయుజాబులలో రోగలక్షణములను కొందరు బహుతక్కువగ వ్రాసెదరు, చాలవివరముగ వ్రాయుట మంచిది.

(5) మా నియమములలోకంటె ప్రత్యేక విధముగు కమీషను మేము ఎవరికైనను ఇచ్చుచున్నయెడల ఆసంగతిని ప్రతిఅర్డరుతోను తెలుపుడు చేయుచుండవలెను. లేనిచో నావిధముగు కమీషను మినహాయించి పంపుటకు వీలుకలుగదు.

(6) మావద్ద ఎవరైనను ఒక సంవత్సరములోపుగ అప్పుడప్పుడు చిల్లరగ వకనూరు రూపాయలు ఖరీదుగల మందులను తెప్పించియుండి, ఆదివరలో ఏవిధముగు కమీషను పొందియుండనియెడల, ఏతేదీలలో తెప్పించుకొన్నదియు మాకు వివరములు వ్రాసినయెడల, అనూటికిన్ని రు 1కి రెండణాలు చొప్పున కమీషను మందులు రూపకముగ యిచ్చెదము.

(7) ఒక చిన్నమనగా నాలుగుగురివిందగింజల ఎత్తు. ఇంగ్లీషుపరిమాణము 6 గ్రేనులు. 1 తులమునకు 30 చిన్నములు లేక 180 గ్రేనులు.

(8) మాకిట్లాగును సాంతముగ చూచి వారి తత్త్వాంగలను బట్టి ఔషధనిర్ణయము చేసికొని మాకు వ్రాసినచో ఔషధమును పంపగలము. లేనిచో వ్యాధిలక్షణముల నన్నిటిని మాకు పూర్తిగ వ్రాసినచో ఔషధనిర్ణయమును కూడ మేమే చేయగలము.

(9) మానిమిత్తము యిచ్చటను వచ్చువారు "వర్నపుపేట"లో అని అడిగినచో మా వైద్యశాలను త్వరలో కనుగొనగలరు. లేనిచో బాడ్లవాండ్ల మోసముచే నొక్కొక్కప్పుడు కొద్దిశ్రమపడవలసివచ్చును. స్వంతగృహముగుటచే గృహము మారదు.

(10) మా కొత్తాదారులలో నెవరికైనను యడ్రస్సు మారినచో మాకు తెలుపుట అనేకవిధముల మంచిది. మా రిజిష్టర్ లో కూడా మార్చుకుని జాబులు వగైరా సరిగా వ్రాయుచుందుము.

# ఆయుర్వేదౌషధరత్నాకరము.

ఇంతటి ఉపయోగకరమైన గ్రంథము ఆయుర్వేదమందు వేరొకటి లేదు. అందును ఆంధ్రులకు అధికముగను పకారము కలిగించుచున్నది. ఆంధ్రదేశమందుగాని, ఆయుర్వేదమందుగాని, ప్రసిద్ధములైన వంటి జర్ని ఔషధములన్నియు మతభేదములతో కూడ నిందు అతివివరముగ కలవు. ప్రతియోగమునకు శ్లోకమును చక్కని వ్యాఖ్యయు కలవు. అట్లుండుట సామాన్యవిషయమే. ఇంతకంటె గొప్పసంగతియేమనగా ప్రతిమందును అనేకవిధములగు విమర్శనలు కలవు. ఎట్లనగా ఏమందునందు ఏవస్తువులు ఎప్పుడు ఎట్లు చేర్చుకొని ఏవిధముగా తయారుచేయవలసినదియు మొదలుకొని తుప్పె ఎట్లు కట్టవలసినదియు, మొదలగు అన్నిసంగతులును వ్రాయబడినవి. సందేహముకల ప్రతివిషయమును ఎత్తుకొని చక్కని సమాధానములు వ్రాయబడినవి. అందుచే యీగ్రంథము దగ్గరనున్నచో ప్రతివారును ప్రతిమందును ఏవిధమగు సందేహమును లేకుండగనే తయారుచేసుకొనగలరు. ఈగ్రంథమునందలి యోగములు తెలియుటకై కొన్నిటిని యిందుదహరించుచున్నాము. కాంతవల్లభరసము, సువర్ణకాంతవల్లభరసము, రజతలోహరసాయనములు, వాతరాక్షసము, సువర్ణవాతరాక్షసము, పాషాణవాతరాక్షసము, త్రైలోక్యచింతామణి, వాతవిధ్వంసి, మహావాతవిధ్వంసి, నవరత్నచింతామణి, సూర్యావర్తులు, స్వర్ణవంగము, వంగరాజీయము, మేహవంగరాజీయము, రజతమేహవంగరాజీయము, సూతికాభరణము, మహాసింధూరభూషణము, వసంతకుసుమాకరము, వంటవసంతకుసుమాకరము, తరుణార్కము, మహాతరుణార్కము, సమగరిశిరుణార్కము, సువర్ణక్రవ్యాది, మహాక్రవ్యాది, లక్ష్మీవిలాసం, మహాలక్ష్మీవిలాసం, శ్రీమృద్ధిమహాలక్ష్మీవిలాసం, బాలసూర్యోదయం, కనకబాలసూర్యోదయం, కాలకూటము, పాషాణకాలకూటము, మేహాంతకం, మహామేహాంతకం, రజతచంద్రోదయం, తారచంద్రోదయం, ఆనందభైరవి, శైత్యాంతకం, హుతాశనం, రాజమృగాంకరసం, కనకసుందరరసం, వంగేశ్వరం, హేమరజతరసాయనం, సువర్ణపుష్పరసాయనం, ప్రతాపలంకేశ్వరం మొదలగు సమస్తయోగములును కలవు. మేము యింతకంటె విశేషించి వ్రాయదలచుకొనలేదు. చూచినవెంటనే అధికమగు ఆశ్చర్యమును పొందగలరు. వెల రు 3-0-0 లు.

# ఆంధ్ర భైషజ్యరత్నావళి.

ఈ గ్రంథముకూడ అత్యుపయోగకరమైనదియే. సుమారు ఇరువది సంవత్సరములనుండి నా వైద్యానుభవములోనున్న అనుభవ విషయములన్నియు ప్రతిరోగమునకును వ్రాయబడియున్నవి. ఈ గ్రంథసహాయమున కొందరు ఆడవాండ్రుకూడ ఆసవారిష్టాదులను జేసుకొని వైద్యముచేయుచు జీవించుచున్నారు. ఇందలి యోగములను వినినచో మీరీ గ్రంథమునకు వెంటనే ఆర్డరివ్వగలరు. కొన్ని యోగములను వ్రాయుచున్నాము గమనింపుడు. అశోకారిష్టము, అశ్వగంధారిష్టము, అర్జునారిష్టము, సారస్వతారిష్టము, ద్రాక్షారిష్టము, వాసారిష్టము, అమృతారిష్టము, జీరకాద్యరిష్టము, సారిబాద్యాసవము, లోహాసవము, చందనాసవము, అశ్వగంధాదిచూర్ణము, పుష్యానుగచూర్ణము, తాలీసాదిచూర్ణము, సితోపలాదిచూర్ణము, భాస్కరలవణచూర్ణము, త్రివృత్ (తెగడ) చూర్ణము, అగ్నిముఖచూర్ణము, మహాద్రాక్షాదిచూర్ణము, స్థాలీచూర్ణము, యోగరాజగుగ్గులు, మహాయోగరాజగుగ్గులు, ఇచ్ఛాభేదివటి, వీర్యస్తంభనవటి, శంఖవటి, అశోకవటి, అగ్నితుండివటి, చంద్రప్రభావటి, కైశోరగుగ్గులు, చందనాదివటి, తాంబూలవటి, అశ్వగంధాది (పెన్నేరు) లేహము, సుగంధిపాలలేహము, కూష్మాండలేహము, మదనకామేశ్వరలేహము, చ్యవనప్రాశలేహము, నారసింహ (శతమూలికాది) లేహము, త్రివృల్లేహము, అశోకఘృతము, పంచతిక్తగుగ్గులుఘృతము, సారస్వతఘృతము, పంచగవ్యఘృతము త్రిఫలాఘృతము, నారాయణతైలము, విషముష్టితైలము, మాషతైలము, ఛాగమాషతైలము, చందనాదితైలము, భృంగామలకతైలము, అమృతామలకతైలము, పిండతైలము, భృంగరాజతైలము, పంచతిక్తపానకము, జంబీరాదిపానకము, మాదీఫలరసాయనము, శంఖద్రావకము, భావనకరక్కాయ, భావనశుంఠి, భావనజీలకర్ర, మొదలగునవన్నియు వ్రాయబడినవి. మీరీ గ్రంథమునుచూచినచో యీ యోగములనన్నిటిని చేసికొనగలరు. వెల రు. 2-0-0 లు.

# భస్మప్రకాశిక.

మాచే రచింపబడిన ఆయుర్వేదౌషధరత్నాకరమందలి మందులను తయారుచేయునప్పుడు, మాచే చెప్పబడిన భస్మములనే వేయవలెననియున్నది అని అనేకమంది జాబులు వ్రాయుటచే అనేకశాస్త్ర ప్రామాణ్యములతోనే గాకుండ నాకుగల అనుభవముతో గూడ యీ గ్రంథము వ్రాసితిని. అనేకగ్రంథములయందు అనేకప్రక్రియలుండవచ్చును కాని ప్రక్రియను చెప్పుటయే కాని దానినిగూర్చి విషయమును, అనగా కష్టసుఖములనుకూడ యిసుమంతయును ఎవరును చెప్పియుండలేదు. ఇట్టి విషయమును వ్రాయుటకు మేమే ప్రథములమని సగర్వముగ వ్రాయుచున్నందులకు మన్నింపవలెను. ఆవిషయమును చూచినచో మీరే ఆశ్చర్యమునుపొందగలరు. ప్రతిభస్మమును చేసుకొనవలసిన విధానములు, అతివివరముగ వ్రాయబడియున్నవి. భస్మంబమిస్త్రము వస్తువును గ్రహించుట మొదలు దానిని సీసాలోవేసికొనువరకు ఏమిచేయవలసినది

యు, మధ్యయందు కలుగుకష్టసుఖములును, తత్పరిహారములును, ఏరంగులో తయారగునదియు, ఎంతమొత్తము తయారగునదియు, గుణభేదములు మొదలగునవన్నియు, విపులముగ వ్రాయబడినవి. ఇట్లు సువర్ణ,రజత, అభ్రక, తీక్ష్ణలోహ,కాంతలోహ, మాండూర, వంగ, సీస, మాక్షిక, తామ్ర,గంధక, ఇంగిలీక,తాళక, శంఖ,కాసీస, ప్రవాళ, వరాటాదులను గురించి అతివివరముగ వ్రాయబడినది. అంతియేకాకుండ ఇంగిలీకమునుండి రసముతీయు విధానము, గంధకభస్మ, గంధకతైలము, గురు (మైలతుత్థ) భస్మలు, యింగిలీకపుకట్లు, యింగిలీకపు మైనములు, యింగిలీక భస్మ, సమస్తపాషాణములయొక్కయు శుద్ధులు, భస్మలు, మైనములు, కట్లు, మాత్రలు, పాలాస్త్రిలు మొదలగునవియు, నారికేళరసాయనము, తామ్రమైనము, గంధకపుష్పము, తామ్రవంగము,రజతనవనీతము, వంగనవనీతము, మాడుబీరుపట్లు, తామరతైలము, గడ్డలు వ్రణములు మొదలగువానికి పట్టీలు మొదలగు అనేక ప్రక్రియలు వ్రాయబడినవి. ఈగ్రంథము నిమిత్తము త్వరపడుడు. వెల రు 1-0-0.

---

# చరకసంహిత చికిత్సాస్థానము.

దీనియొక్క మహామహిమచే నిది సమస్తభాషలలోనికిగూడ తర్జుమా చేయబడినది. కాని యిదివరలో దీని నెవ్వరును ఆంధ్రములోనికి తర్జుమా చేయక పోవుటకు గల కారణము తెలియకున్నది. దీనిని యింతకాలమునకు మేమే ఆంధ్రీకరించితిమి. దీనిని ఆంధ్రీకరించుటకుగల వ్యయప్రయాసలను గూర్చి మేముకూడ మొదట చాల భయపడితిమి. కాని యిట్టిగ్రంథమును ఎటులైనను తప్పక ఆంధ్రీకరింపవలెననెడి, నేను చదువుకొనుచున్నప్పటినుండియు యున్న షుమారు 10 సంవత్సరముల అభినివేశముతో దీనిని ఆంధ్రీకరించితిని. చికిత్సావిషయమైన గ్రంథములలోనికెల్ల నిది అద్వితీయమైనదని మహామహులచేగూడ ఒప్పుకొనబడియున్నది. దీనియందు వ్రాయబడినట్టి చికిత్సా విధానములు ఏ గ్రంథమునందు వ్రాయబడి యుండలేదు. దీనికి చికిత్సాస్థానము సామాన్యముగా పేరు కలిగినది. కాని యిందు రోగనిదానముకూడ అతివివరముగ వ్రాయబడినది. నిదానమును వ్రాసి వెంటనే చికిత్స వ్రాయుట చాలమంచిదని యితడీపద్ధతిని అవలంబించినాడు. శాస్త్రము తెలిసి వైద్యము చేయుచున్నామని అనుకొనదలచినచో యీ గ్రంథము తప్పక దగ్గరవుండి తీరవలెను. ఇందు చికిత్సావిధానములును, రోగనిదానమును వివరముగ వ్రాయబడియుండుటయేగాక ప్రసిద్ధములగు యోగములుకూడ వ్రాయబడినవి. కావున యిట్టి యుద్గ్రంథమును ప్రతివారును వెంటనే తెప్పించుకొనెదరని నమ్ముచున్నాము. వెల రు 6—0—0 లు

N. B. క్యాలికోబైండు, దళసరి కాగితము, గొప్పగ్రంథము మొదలగు కారణములచే రు 12-0-0 లు వెలవేయవలసియున్నను అందరికిని సులభసాధ్యమగునట్లు సగముధరకు అనగా రు 6-0-0 లకే యిచ్చుచున్నాము.

# అనుభవదీపిక.

ఇదియొక అపూర్వ అత్యద్భుత నూతనవిషయ విమర్శనగ్రంధము. దీనియొక్క ప్రాశస్త్యమునుగూర్చి ఏమి వ్రాయువలయునో మాకే తెలియకున్నది. మా ఫార్మసీ యందు తయారైన మందులను మేము ఏ నిమిషమందు ఏమిచేసినదియు, ప్రతివిషయమును ఎప్పటికప్పుడు వ్రాసియుంచెదము. ఇట్లు కొన్ని సంవత్సరములుగ వ్రాయబడిన విషయములనంతను గ్రంథరూపమున అనుభవదీపికయనెడి పేరుతో ప్రచురించితిమి. శాస్త్రమందు చెప్పబడి అప్రకారముగ చేయబడిన విధానములనేగాక మాయొక్క బుద్ధికుశలతతో అనేకవిధములగు మార్పులనుచేసి చూచి వ్రాసితిమి. ఎంతటి ఘనవైద్యులు తయారుచేసినను కూడ ఒకేమందు ఒకప్పుడొక విధముగను, మరియొకప్పుడింకొకవిధముగను తయారగుచున్నది. అందుచే అనేక విధములగు నష్టకష్టములు కలుగుచున్నవి. అట్టి కష్టమును రూపుమాపి ఎల్లప్పుడును ఒకేవిధముగ తయారగునట్లు చేయుటకై యీ పరిశోధనల నన్నిటిని చేసి లోకోపకారార్థమై పైవానినిగూడ ప్రకటించితిమి. ఒకరూపాయిమాత్రమే ఖర్చుచేసిననో మీకు సంగతులన్నియు తెలియగలవు. దీనివలన కలుగు అనుభవము ఎంత శ్రమపడినను ఎన్ని వేల ధనము ఖర్చుచేసినను లభింపజాలదు. వెల రు 1—0—0.

N. B. కొన్ని పుస్తకములను ఏకముగా ఒకేసారి తెప్పించుకొన్నచో అవసరమును సారముగ తప్పక తగ్గించి పంపెదము.

---

# విజ్ఞప్తి.

సుమారుఒకసంవత్సరములోనే వచ్చిన యోగ్యతాపత్రములను కొన్నిటిని మాత్రమే యిందు వ్రాయుచున్నాము. మాకుగల సుమారు యిరువది సంవత్సరముల వైద్యానుభవములోను యోగ్యతాపత్రములు మొదలగువాని నెన్నిటిని పొందితిమో వీనినిబట్టి మీరే వూహించుకొనగలరు.

మిస్సెస్ శాస్త్రిగారు (కాకినాడలోనుండు ఈస్టుగోదావరి డిస్ట్రిక్టు సర్జను గారి భార్యాగారు) 22-3-33 తేదీని యిట్లువ్రాయుచున్నారు.

మీ మందువలన నాకు కొంచెము గుణముగావున్నది. వివరముగా మరియొక వుత్తరములో వ్రాసెదను.

---

అయ్యా! తమవద్దనుండి రప్పించిన బాలసుధవాడిచూడగా అమోఘముగా పనిచేసినందున నేను అశ్చర్యమును పొందితిని. మాదిం అప్పలస్వామి,

24—10—32 నేటివ్ డాక్టరు. కౌండాగ్లే, రంగూన్.

---

గురువరా! మీ గ్రంథములను మీ ఔషధములను శ్లాఘించుటకు వలనుపడదు. శ్లాఘించుటమాత్రమేగాక ఆనందమును తన్మయత్వమును మీయందు అనురాగమును జనించుచున్నది. మహాశయా! పిల్లలకు నుపాధ్యాయులు బోధించురీతిగా చిన్నచిన్న మాటలతోను వ్రాసిన విషయమునే బుద్ధికి సుబోధమగునట్లుగా పలుమారు వ్రాసి విద్యతెలియని వైద్యబృందమునకు సహితము తెలుసుకొను నంతటి ఓపికతోను తాము వ్రాసిన గ్రంథముల ప్రాశస్త్యమునుగూర్చి నేను శ్లాఘించుట యందతిశయోక్తి కానరాదు. మీ గ్రంథములకును మీకును వేయి నమస్కారములు.

16—9—32 పి. మునిస్వామినాయుడు, కోసువారిపల్లి, చిత్తూరుజిల్లా

---

అయ్యా! మీఫొటో కాగితమును ఒకటిమాకు ఉచితముగా పంపేది. మేము అద్దములో వేసుకొని మిమ్ములను గురువుగా భావించెదము. మీ గ్రంథములు మాకు చాలా ఆనందముగావున్నవి. యస్. పి. బాలన్న,

5—4—32 జిల్లేళ్ళ, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! తాముపంపిన ద్రాక్షారిష్ట, చ్యవనప్రాశలేహ్యము ఒక ఆడబిడ్డకు వుపయోగించితిని. ఆబిడ్డకు దృఢమైన శక్తికలిగినందున చాలా సంతోషమైనది. ప్రజాఆనందము వ్రాయుటకు యీ కొద్ది చాలదు. నీలా నృశింహాచార్లు,

28—2—32 వేపరాల, కడపజిల్లా.

---

అయ్యా! మీరు చేయుచున్న సేవ వర్ణనాతీతము. ఆంధ్రదేశమునకు వన్నెతెచ్చినవారిలో మీరొకరని నేను వర్ణింప నవసరములేదు. మీస్వలాభాపేక్షయేగాక సోదరవైద్యులకుగూడ చేయూతనొసంగుచు చేయుచున్న సేవకు సర్వేశ్వరుడు మీకు చిరాయురారోగ్యము లిచ్చుగాక. మద్దూరి. వి. యల్. యన్. అప్పారావు,

8—2—33 మిరాశీదారు, వడ్డిప, నర్సాపట్నం, విశాఖపట్నంజిల్లా.

---

అయ్యా! లోకపూజ్యులగు తమవంటి మహనీయులను జిల్లాకొక్కరినైననూ సృజించగలందులకు దేవుని పదేపదే ప్రార్థించుచున్నాను. గుండారపు వెంకన్న,

26—11—32 జార్జిపేట, తూర్పుగోదావరిజిల్లా.

---

అయ్యా! అద్భుతమైన గ్రంథములు రచించి లోకమునకు వెల్లడిచేసినందుకు పదివేల వందనములు. కంభం సిద్ధారెడ్డి,

5—5—32 చీకటిపల్లి, చిత్తూరుజిల్లా.

---

మహాశయా! ప్రతిదినము ప్రతిపత్రికారాజములలోను తమ నామధేయమును తమ సుప్రసిద్ధ ప్రకటనలను గాంచి మీదేశసేవకును మానవసేవకును మిగులసంతసించుచున్నాడను. 25—1—33 ఆర్. వరదరాజులు, కాళహస్తి, చిత్తూరుజిల్లా.

---

అయ్యా! స్వర్ణవంగము మీరు వ్రాసినప్రకారము చేయగా అత్యాశ్చర్యముగా స్వర్ణతుల్యమైన రంగులో నలరారినందున చాల సంతోషించినారము. ఇట్టిరంగు యిదివరలో నేను చేసినవాటికి లేదు. రంగుతోపాటు గుణాధిక్యముకూడ నిదర్శనమైనది. తమరు విశేష అనుభవనియముగా గ్రంథములు రచించినారని యిప్పటికి నేనున్నూ, మా గురుశ్రేష్టులైన ఏడిద సంగప్పగారున్నూ మిగుల సంతుష్టిచే నోలలాడుచున్నాము.

డి. శోభనాద్రిరావు,

3-2-33 పెట్టి ఆఫీసరు, పెంటకోట, విశాఖపట్నం జిల్లా.

---

అయ్యా! మీరు పంపించిన ఆయుర్వేదౌషధరత్నాకరము, భస్మప్రకాశిక, అనుపానకల్పవల్లి అను గ్రంథములు కన్నులపండువై తోచినవి. అంధకారమునకు అర్కునిభంగి మా మనస్సును తమ నిర్మితములైన గ్రంథములు చాలా సంతోషమును కలుగజేసినవి.

తామరపల్లి వీరబ్రహ్మం,

5—11—32. బొల్లెద్దుపాలెం, తూర్పుగోదావరి జిల్లా.

---

ఆర్యా! మీ దర్శనముకొరకు మనస్సు చాలా తహతహపడుచున్నది. చాలా దూరదేశమగుటచే తమ దగ్గరకు వచ్చుటకు వీలుపడకున్నది. కొలది కాలములోనే తమ దర్శనముచేసి చాలా సంతోషించెదను. మహాత్మ మిమ్ములను తలంపని దినము లేదు.

సి. తిరువెంగళయ్య,

7-10-32 ఆయుర్వేదిక్ డాక్టర్. వుయ్యాలవాడ, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! తాము బహు ప్రయాసతో ఔషధములను చేయు క్రమమును పరీక్షించి వ్రాసినందులకు అనేక కృతజ్ఞతావందనములు. పరమేశ్వరుడు మీయొక్క సంకల్పమునకు తోడ్పడుగాక.

మీసాల సత్యనారాయణమూర్తి,

7-9-32 ఆయుర్వేదిక్ డాక్టర్, చించినాడ, ప॥ గోదావరిజిల్లా.

---

ఆర్యా! మీరు వ్రాసినప్రకారము కొన్ని భస్మలను తయారుచేయగా సక్రమముగా తయారైనందుకు మీకనేక నమస్కారము లాచరించువాడను. వైద్యులకు మిక్కిలి అనుకూలమగు త్రోవనుజూపి చిరకీర్తిని సంపాదించుకొంటిరి.

యం. సదాశివరావు, బ్రాంచి పోస్టుమాస్టరు,

20—3—32. గూలూరు, కోలారుజిల్లా.

---

పండితవర్యా ! తాము పంపిన లోహాభ్రకసిందూరము తమ సలహా ప్రకారము వాడుచున్నందుకు రోజురోజుకు వ్యాధి తగ్గుదశకు వచ్చుచున్నందున తమకు వందనశతంబులర్పించుచున్నాను.

ఎ. శంకరయ్య,

18—1—33. బంగినిపల్లి, నెల్లూరుజిల్లా.

---

అయ్యా! తమచే వ్రాయబడిన ఆయుర్వేదౌషధరత్నాకరము ప్రజలకెంత యు నుపయోగంబై అలరారుచున్నది. ఇందన నారాయణమూర్తి,
14—1—33. తాటిపర్తి, తూర్పుగోదావరిజిల్లా.

---

అయ్యా! తమసలహా ప్రకారము తైలమును తయారుచేసి అనేక డాక్టర్లకు స్నేహితులకు యిస్తిని. వారి అభిప్రాయం చాలాబాగుగా ఏర్పడినది.
క. సీతారామజోయిస్, రతన్ మిశ్రడిపో,
13—10—32. నగరత్ పేట, బెంగుళూరుసిటీ.

---

మహాశయా! మీ అనుభవదీపిక నాకెంతయు చాలా సహాయకారిగా నున్నది. శెట్టిలూరి విజయసారథి, నేటివ్ డాక్టరు,
3—11—32 బూరుగుపల్లి, ప॥ గోదావరిజిల్లా.

---

అయ్యా! మీరంపిన మహావాతవిధ్వంసి అతిజరుగురుఅగు కాలములో ఒక వైద్యునికివ్వగా చాలా చక్కగ పనిచేసినదని సంతసించిరి.
క. వీరభద్రరావు, ఆయుర్వేదిక్ డాక్టరు,
22—2—33. మెంటాడ, విశాఖపట్నంజిల్లా.

---

అయ్యా! తమచేచేయబడిన గ్రంథరత్నసముదాయములు కొందరిస్నేహితుల వద్ద చూచి ఆనందార్ణవమగ్నులమైతిమి. మంగోలు రాఘవులు,
25—2—32 హైదరాబాద్.

---

అయ్యా! తమగ్రంథములు అనుభవమైనట్టివని లోకప్రసిద్ధమైనట్టివని నేను విని తమయొక్క రోగములన్నిటిని తమపై ఆనతిపెట్టి తమకే గురువులని భావించిచేయ వలయునని యత్నించుచున్నాను. వుట్టి రంగప్ప,
2—3—32 కన్నెలూరు, కడపజిల్లా.

---

అయ్యా! మీరు పంపిన పుస్తకములను సాంతముగా చదువుచుంటిని. చదువరుల కష్టములను గ్రహించి అట్టి విషయములను పూసగుచ్చినరీతిని విశదీకరించినందుకు చాలా సంతోషము కలిగినది. క. శ్రీనివాసరావు,
3—4—32 కరప, తూర్పు గోదావరిజిల్లా.

---

అయ్యా! మీరుకూడ పంపించిన వైద్యగ్రంథములుకూడ చాల సహాయకరముగా నున్నవి. చిలకమర్రి నంబెరుమాళ్లాచార్లు,
5—5—32 సికింద్రాబాద్

---

బాబూ! తమరు పంపిన లఘుసిందూరభూషణం వాడుకచేస్తిని. చాలామట్టుకు గుణమిచ్చినది.

టి. సూర్యయ్య, అసిస్టెంటు ప్రైమరు ఎగ్జామినరు
25—5—32 భోజాడి, మాంధంజిల్లా, కలకత్తా ప్రెసిడెన్సీ.

---

విన్నపములు! నేనిదివరలో విశాఖపట్నమునుంచి నా కుమారునికి వున్న దేహాసితిని తెలియజేసి తమవలన చేయబడిన మహాకామసంజీవనిరసమును తెప్పించి సేవింపజేసి వాని శరీరమందు చాలామట్టుకు గుణము కనుగొంటిని.

పూర్ళ వెంకటసుబ్బారావు,
3—10—32 పేష్కారు, దేవిడి, గంజాంజిల్లా.

---

అయ్యా! బాలసుధ సీసా ఒకటి అర్జంటుగాపంపవలయును. ఇదివరకు తాము పంపిన సీసా చాల బాగుగాపనిచేశినందున మరల వ్రాసినాను.

షేకు మస్తాన్ సాహెబు,
14—11—32 సిద్ధవరం, నెల్లూరు జిల్లా.

---

అయ్యా! తాములోగడ పంపిన లోహాభ్రక సిందూరం చాలా గుణమిచ్చినది.

యస్. శివరావు,
11—11—32 సిగ్నలరు, ఖడ్గపూర్, కలకత్తా ప్రెసిడెన్సీ.

---

అయ్యా! మీ ఔషధములన్నాదు మితిలేని గురికలవి.

చెలసాని మాధవరాయడు, గ్రామమునసబు
28—11—32 పోతునూరు, ప॥ గోదావరి జిల్లా.

---

అయ్యా! తమరుపంపిన బాలసుధ చాలా బాగుగాపనిచేశినది.

సి. హెచ్. వెంకట సుబ్బారావు,
లోకల్ ఫండు ఆయుర్వేదిక్ డిస్పెన్సరీ డాక్టరు,
16—12—32 నక్రికల్. గుంటూరు జిల్లా.

---

అయ్యా! మీ భస్మప్రకాశిక నేను చదివి వైద్యం చేస్తూ కృతార్థుడనై అన్న వస్త్రములకు లోటులేకుండా జీవించుచున్నాను.

గంధం వీరాస్వామి నాయుడు,
3—1—33 విలస, తూర్పు గోదావరి జిల్లా.

---

అయ్యా! తాముపంపిన మందువల్ల చాలా గుణముకనపడినది.

యస్. వెంకటాచారి,
9—9—32 చోడవరం, విశాఖపట్నం జిల్లా.

---

మహాశయా! మీవద్ద మహామేహాంకుశం వగైరా తీసుకువెళ్ళివాడినాను. తమ ఆశీః ప్రభావమువలన చక్కనిగుణమిచ్చినది. గొల్లపూడి రాఘవరామయ్య,
19—3—32 చందవరం, గుంటూరు జిల్లా.

---

అయ్యా! తాముపంపిన భృంగామలక తైలము చాలా బాగుగాపనిచేసినది.
కొట్టావు రామస్వామి,
7—6—32 మాడుగుల, విశాఖపట్నం జిల్లా.

---

అయ్యా! నేను స్వయముగా మీతో మాట్లాడి మందు తీసుకొనివుంటిని వ్యాధి చాలాభాగము నెమ్మదించినది. యం. సత్యనారాయణ.
19-4-32 ఫిరంగిపురం, గుంటూరుజిల్లా.

---

అయ్యా! మీ మందులు సంతుష్టికరముగా పనిచేయుచున్నవి.
కె. వీరభద్రరావు, ఆయుర్వేదిక్ డాక్టర్
5-4-32 మెంటాడ, విశాఖపట్నంజిల్లా.

---

అయ్యా! తమ ఔషధములు చక్కగా పనిచేయుచున్నందున సశాస్త్రీయములని నమ్ముచున్నాను. బి. సీతారామరాజు, ఆయుర్వేదిక్ డాక్టర్,
7-3-32 మాడుగుల, విశాఖపట్నంజిల్లా.

---

అయ్యా! తమరు యిదివరలో పంపిన వంటబాలసూర్యోదయం అందినది. ఆ మందు మా తమ్ముడు పుచ్చుకున్నాడు. చాలా గుణమిచ్చినది.
ఎ. సూర్యనారాయణ, సిగ్నలరు,
10-2-32 ఖడ్గపూర్, కలకత్తా ప్రెసిడెన్సీ.

---

అయ్యా! తమ ఔషధములు చాలామట్టుకు ఉపకారము చేయుచున్నవి. వ్యర్థమగుట లేదు. నీలా నృశింహాచార్లు,
21-1-32 వేపరాల, కడపజిల్లా.

---

అయ్యా! ఇదివరలో తాము పంపిన శతమూలికాదిలేహ్యం బాగుగా పని చేసినది. ఆయిలూరి సిద్దయ్య, ఆయుర్వేద వైద్యులు,
6-1-32 అత్తిలి, ప॥ గోదావరిజిల్లా.

---

అయ్యా! తాము పంపిన పుస్తకములు యితరపుస్తకములకంటె ఎక్కువ తోడ్పడుచున్నవి. ఆర్. సి. పి. శర్మ, నేటివ్ డాక్టర్.
5-1-32 కోసమల, గంజాంజిల్లా.

---

అయ్యా! తమయొక్క ఆయుర్వేదౌషధరత్నాకరమును సాంగముగా చదివి పరమానందమును బొందితిని. యం. మల్లయ్య, ఆయుర్వేదిక్ డాక్టర్,
1-1-32 ప్రొద్దటూరు, కడపజిల్లా.

---

అయ్యా! తమ ఔషధములు ఆంధ్రదేశమున బహుఖ్యాతివహించినవని నా స్నేహితులవలన వినియున్నాను. ఎ. యస్. భాస్కరరావు,
7—2—32 ఖడ్గపూర్, కలకత్తా ప్రెసిడెన్సి.

---

అయ్యా! మీ ఔషధములయందు నాకు గొప్పనమ్మకముగలదు.
14—12—32 వి. రామసుబ్బరాయుడు, కొల్లాపురం, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! తమశాలసుధ అమోఘముగా పనిచేయుచున్నదని వినియుంటిని.
పి. రామకోటేశ్వరరావు, లోకల్ ఫండు ఆయుర్వేదిక్ డిస్పెన్సరీ డాక్టరు,
30—11—32 కేమిడిచెర్ల, గుంటూరు జిల్లా.

---

అయ్యా! మీతామ్రమస్మైనమువలన సెగపుండ్లు,నోటియందలిపుండ్లు బాగైనవి.
30—1—32 నంది రంగయ్య, తమడపల్లె, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! మీ గంధకపుష్పమును వాడగా కురుపులు అన్నినివారణఅయినవి.
7—9—32 బి. వీరయ్య, హోసూరు, కర్నూల్ జిల్లా.

---

అయ్యా! తమవద్దనున్నటువంటి మందులు శ్రేష్టముగా నున్నవని కొందరిస్నేహితులవలన వినియు, మీరుచేసిన గ్రంధములు చదివియును మనసునకు ధృఢమైన నమ్మకము కలిగినది. యన్. సత్యనారాయణశాస్త్రి,
25—2—32 జాగీర్ దార్, హైదరాబాద్.

---

అయ్యా! మీ అనుపానకల్పవల్లిలో వ్రాసినవిధమున ఔషధములను వాడి గుణములను బాగుగకనుగొనుచుంటిని. వి. వి. రామయ్య, మెడికల్ప్రాక్టీషనర్,
2—4—32 కొత్తూరు జగన్నాధపురం, తూర్పు గోదావరిజిల్లా.

---

అయ్యా! మీరిదివరలో పంపిన గంధకరసాయనము గుణమిచ్చినది.
3—5—32 పూసపాటి కోటయ్య, మందపాడు, గుంటూరుజిల్లా.

---

అయ్యా! మీరు పంపించిన గ్రంథములందలి విషయములు నాకు చాలా సంతోషముగా యున్నవి. కందేపు వెంకటేశ్వర్లు,
25—5—32 అల్లూరు, నెల్లూరుజిల్లా.

---

# సరిగ రెండు నెలలకే వచ్చిన యోగ్యతాపత్రములు



మామందులనుగాని పుస్తకములనుగాని మాకు వ్రాయునపుడు 8-4-31 మొదలు 8-6-31 వరకు అనగా సరిగ రెండునెలలలోనే వ్రాసిన కొందరియొక్కయోగ్యతా పత్రములను కొన్నిటిని కొంతవరకు మాత్రము క్రింద వ్రాయుచున్నాము. వానినిబట్టి మాకుగల 20 సంవత్సరముల వైద్యానుభవములో యెన్నియోగ్యతాపత్రములను పొందినదియు మీరే ఊహించుకొనగలరు.

ఇట్లు విన్నవించు సకలసజ్జన విధేయుడు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, బెజవాడ.

---

నేను యిదివరలో యెన్నియో ఆయుర్వేదపుస్తకములు తెప్పించితిని కాని తమయొక్క పుస్తకములవంటిఅనుభవము వేరుపుస్తకములలో యింతచక్కని అనుభవము కాదు. తమయొక్క గ్రంథములవలననే ఆల్ ఇండియా కాన్ఫరెన్సు మొదలగు సభలయందు తమశాస్త్రప్రకారము అవుషధములు చేసి యోగ్యతాపత్రములు, పతకములు పొందితిని. వెయ్యేల, తమవల్లనే పండితుడని పేరుపొందితిని.

పండిత, కె. నారాయణయ్యర్,
8—4—31. నందిహిల్సు, బెంగుళూరు జిల్లా.

---

అయ్యా! తాము వైద్యలోకమున కెంతయు పరోపకారములగు గ్రంథములను రచించి వైద్యబృందమును సంతోషమున నోలలాడించిరి. శిశువులకు వచ్చెడి రోగములు వాటికి తగియుండు చికిత్సలతో ఒక గ్రంథము తయారు చేయించి ప్రచురించినచో వైద్యలోకమునకు అత్యధిక పరోపకారార్థ పాత్రులయి తమ పేరు జగద్విఖ్యాతమై విలసిల్లుచుండగలదు.

డొంకెన అప్పారావు,
8—4—31 విజయనగరం, విశాఖపట్నం జిల్లా.

---

అయ్యా! ఆయుర్వేదవైద్యమున చికిత్సాభాగవిషయములో తాము శ్రమపడి పరిశీలనా విమర్శనలతో ప్రచురించిన గ్రంథములవల్ల, ఆంగ్లేయవైద్యము అనుభవయుక్తముగా ప్రాక్టికల్‌గా యున్నదనియు ఆయుర్వేదము లుప్తముగా యున్నదనియు చెప్పుకొన్నవాదుక తగ్గినది.

మణుగూరి నరసింహాచార్యులు,
10—4—31 నందివెలుగు, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా.

---

తమపుస్తకములు మిక్కిలి వుపయోగకరముగా వున్నవని తెలియజేయుచూ మిక్కిలి సంతొసించుచున్నాను.

ఆయుర్వేదిక్ డాక్టరు, మాకెన రంగయ్యపాత్రుడు,

12—4—31 చోడవరం, విశాఖపట్నం జిల్లా.

---

సంస్కృతభాషయందు శిథిలమగుచున్న ప్రాచీన ఆయుర్వేద వైద్యగ్రంథములు పురుగుపడియున్నవానిని తమబోటి పరోపకారపారీణులు, ధీనిధులు, విద్యావివేకసంపన్నలు యెల్లరకును సుబోధమగునట్లు పునరుద్ధరింపగలరు. అట్టి ప్రయత్నము యాధన్వంతరి కలుగజేయ ప్రార్థించుచున్నాను.

పెన్మత్స బాపిరాజువర్మ,

13—4—31 సుసరాం, కళింగపట్నం పోష్టు, గంజాంజిల్లా.

---

భిషగోద్ధారకా! ఇదివరలో తామురచించిన వైద్యవిషయకగ్రంథములన్నియు తెప్పించి అందలి అనుభవయోగములన్నియు పరిశీలించి వానిలో చాల యోగములు చేసియుంటిని. మీభస్మప్రకాశిక వైద్యప్రకాండులగు శ్రీమాన్ గోపాలాచార్యులవారి వ్యాఖ్యానసహిత రసప్రదీపికయు మిన్నయని నిష్పక్షపాతముగ జెప్పవలసియున్నది. ధీమంతులగు పెద్దలు గురువులను మించిన శిష్యులు గావలయునని యే ఆశీర్వదించు చుందురు. ఆచార్యులవారి దీవన మీయందు సార్థకమయ్యెను. ఆంధ్రలోకమున మీ రొనర్చుచున్న దివ్యసందేశము స్వర్గీయులగు మీ గురువర్యుల ఆత్మానంద మొనగూర్చెననుటలో అతిశయోక్తి గన్పట్టదు.

యం చెంగయ్య, నేటివ్ డాక్టరు,

13—4—31 వత్తలూరు, రాజంపేట పోష్టు, కడపజిల్లా.

---

మీరంపిన అనుపాన కల్పవల్లి నే జూడ మీ విజ్ఞానమునకు అద్భుతాశ్చర్యాయుక్త చిత్తమగ్నుడనై వేనోళ్ళ శ్లాఘించువాడ. నేయేల మీరు తొలుత ప్రకటించిన పొత్తరత్న త్రయములే సాక్ష్యత్వము నిచ్చినదనుట అతిశయోక్తిగాదు. ఆర్యా! మీరు నూతనముగా దేశోద్ధరణగూర్చి ప్రకటించు అనుభవదీపికయను పొత్తము సిద్ధము అయినపుడు నొకటిపంప కుతూహాలుడ. మృతజీవులగు ఆయుర్వేదమార్తాండ రత్నలగు గోపాలాచార్యులుగారి శిష్యులుగాన సౌరభమబ్బిన చందమున మీపుస్తకములు జగత్ప్రసిద్ధములు. జగత్తునకు మీరుచేయుమేలు ఆచంద్రార్కతారావనీశరధిస్థాయిగ వెలుగునట్లు పరాత్పరుని అహర్నిశములు ప్రార్థించుచున్నాను.

వైద్యరాజ, బ్ర. [illegible],

17-4-31 [illegible] కళింగపట్నం, గంజాంజిల్లా.

తమవద్దనుంచి తెప్పించుచున్న ఔషధములు చాలా బాగా పనిచేయుచున్నవి.

నేదునూరి సన్యాసయ్య,

18-4-31 పోచినపెద్దిఅగ్రహారం, విశాఖపట్నం జిల్లా.

---

ఇదివరలో తాము ప్రకటించిన గ్రంథములను తెప్పించి చూచియుంటిని. చాల అనుభవపూర్వకములుగను వుపయోగకారులుగను వున్నవని వ్రాయుట కెంతయో సంతోషించుచున్నాను.

టి. రామచంద్రరావు,

21-4-31. చక్రధరపూర్, బి. యన్. ఆర్.

---

అయ్యా! మీరు పంపించిన సిద్ధమకరధ్వజము తృప్తికరముగా పనిచేయుచున్నది. ఇంకొక సావుతులమును పొట్లములుకట్టి పంపుడు.

4-5-31 సి. రాజగోపాలరావు,

టవున్ హాల్ స్ట్రీటు, విశాఖపట్నం.

---

తమవద్దనుండి తెప్పించిన ద్రాక్షారిష్టము మొదలగు మందులను యిచ్చుటవాడితిని. చాలా గుణములను నామనస్ఫూర్తిగా పనిచేసినవి.

చిత్రకవి అనంతాచార్యులు,

4-5-31 చిత్రకవివారిపాలెం, కందుకూరిపోష్టు, నెల్లూరుజిల్లా.

---

తమరు పంపిన గంధకరసాయనమును సేవించినాను. దురద, మేహానాంతర్గతమైన తెలుపు తగ్గినవి.

కలిదిండి బంగారురాజు,

5-5-31 కోపల్లె, బండారుపోష్టు, వెష్టుగోదావరి జిల్లా.

---

మీరు చేసిన గ్రంథములన్నియు చూచితిని. మీరు దేశోపకారార్థమై యీ గ్రంథములను చాలా కష్టించి వ్రాసినారు. ఈగ్రంథములుచూచి నామనస్సు చాలా సంతోషమయినది.

యం. పంచాపతిరావు,

9-5-31 నక్కలపల్లి, బెళుగుప్పపోష్టు, అనంతపురం జిల్లా.

---

తాము 17-4-31 తేదీన నాకొరకు పంపిన స్ఫటికాది చూర్ణమును, రోగ రాజగుగ్గులును వాడితిని. రక్తస్రావము కొంత తగ్గినది.

మహంకాళి రామమూర్తి,

17-5-31 కోటిపల్లె, ఈస్టుగోదావరి.

---

అయ్యా! తమరు పంపిన అనుపానకల్పకము చేరినది. చాలా సంతసపడితిని.

బి. అప్పలనరసయ్య,

18-5-31 వరదారోడ్డు, జెట్నిపోష్టు, బి. ఎన్. ఆర్.

---

తమచే విరచితంబైన కృష్ణపండితీయమును, ఆయుర్వేద ఔషధయోగరత్నాకరమును, భస్మప్రకాశికయును వందనములతో నందుకొని చూచి ఆనందించితిని.

ఆయుర్వేదవైద్య, పుల్లక్తేని కుటుంబాచార్యులు,

21-5-31 తాళ్ళపాలెం, బందరుపోస్టు, కృష్ణాజిల్లా.

---

అయ్యా! మీవద్దయుండు మందులు చాలా గుణముగలవని నేను అనేకమంది వల్ల తెలుసుకొంటిని. గాన దిగువ కనపరచిన రోగమునకు తగుమందు పంపవలెను.

ఆర్. వెంకట రమణప్ప,

31-5-31 పెదపల్లి, కదిరితాలూకా, అనంతపురంజిల్లా.

---

మీరు పంపిన తక్రారిష్టము సేవనచే అర్ధభాగము గుణము అయినది. కనుక యింకొక పౌను పంపవలెను.

వడ్డె బండెప్ప,

2-6-31 హరిమెల్ల, పుర్వకొండపోస్టు, అనంతపురం జిల్లా.

---

మీ మందులు చాల మంచివని మా మిత్రులు, పి. ధనరాజుగారు చెప్పిరి. గాన క్రిందిమందులను పంపుడు.

పి. తాతయ్యనాయుడు,

3-6-31 మోరిపాలెము, ఆ[illegible]పోస్టు, ఈస్టు గోదావరిజిల్లా.

---

నేను ఆయుర్వేద ఔషధరత్నాకరమును తెప్పించి భగవంతునినమ్మి, మీ పుస్తకములోనుండిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిన గుర్తులు అనియెంచుకొని ఔషధములు చేయబూనుకొని ముందు మకరధ్వజమును జేసితిని. అప్పుడు చాలామంది సంతోషించిరి. పిదప పూర్ణచంద్రోదయము, సువర్ణకాంతవల్లభరసము, వాతాగ్నికుమారము, మొదలగువానిని జేసితిని. అప్పుడు నామీద చాలామంది పెద్దమనుష్యులకును, వైద్యులకును చాలా దయగలిగినది.

అయ్యర్ దాసు,

6-6-31 పగిడాల గ్రామము, కర్నూలుజిల్లా.

---

ఔషధపాకానుభవములను వెల్లడిజేయు గ్రంధములలో తమ అనుభవదీపిక మొదటిది. రహస్యమింతేనలేక వైద్యానుభవమును వెలుపరుపనుండు తమ సదుద్దేశమెంతయు స్తవనీయము.

వైద్యము విశ్వనాధరావు,

8-6-31 ధర్మవరం, అనంతపురంజిల్లా.

---

# వర్తక నియమములు.

1. జాబుల ప్రకారముగ మామందులను మాపుస్తకములను వాల్యూపేయబుల్ (వీ. పి.) పార్శిల్ ద్వారా పంపెదము.

2. జాబుఅందినరోజుననే మందులను తప్పక పంపెదము. జాబు అందినతరువాత తయారుచేయవలసియున్నగాని ఆదివారము మొదలగు ప్రత్యేక కారణములున్నగాని 1,2 రోజులు ఆలస్యములో తప్పక పంపెదము.

3. మందులధికబరువుకలవిగ నున్నయెడల రైల్వేపార్శిల్ ద్వారా సమీపముననున్న రైల్వేష్టేషనుకు తెప్పించుకొని ప్యాస వి. పి. చేయించుకొనుటమంచిది. ద్రావకముల మొత్తము రెండుపౌనులకధికముగనున్నచో పోష్టులో పంపుటకిష్టము. రైలులో అయినచో ఎన్ని పౌనులు అయినను బహుభద్రముగ చేరుటయేగాక ఖర్చుగూడ బహు తక్కువగును.

4. పంపుటకగుఖర్చునంతను కొనువారలే భరింపవలెను.

5. ప్రతిజాబునందును పంపవలసిన యడ్రస్సును తెనుగుతోగాని ఇంగ్లీషుతోగాని వివరముగ వ్రాయుచుండవలయును.

6. రు 25. లకుమించిన ఆర్డరునకుగాని బరువధికముగానుండు మందుల ఆర్డరునకుగాని 4వ వంతు పైకమునుముందుగపంపవలయును.

7. మందులు మంచిఅనుభవశాలురచే చక్కగకట్టిపంపబడును ఏకారణముచేనైనను సీసా బ్రద్దలగుట మొదలగునవి సంభవించిన యెడల ఆనష్టమును కొనువారలే భరింపవలయును.

8. ఒకేసారి కొనేయెడల రు 25 లకు రు.1కి 0-1-0 చొ॥, రు 50 లకు 0-1-6 లు చొ॥, రు 100 లకు 0-3-0 లు చొ॥, కమీషను యిచ్చెదము. మందుల ప్రాశస్త్యమునుబట్టి అంతకుహెచ్చుకమీషను యిచ్చుటకు వీలులేదు.

N. B. పోష్టల్ రూల్సుప్రకారము వీ.పి.లు పోష్టులో హెచ్చు రోజులు నిలవఉండవు. కాన వెంటనే పుచ్చుకొనుచుండవలెను.

వలయువారు వ్రాయవలసిన విలాసము:—

డాక్టర్ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, బెజవాడ.

ఓం.

శ్రీరస్తు.

ఆరోగ్యమస్తు.



ఆంధ్రదేశమందు అతి ప్రసిద్ధులును, మందులను చేయించుటయందు
అతి నేర్పరులును, అనేక గొప్పగొప్ప ప్రక్రియలను రహస్య
ప్రక్రియలను గ్రంథముల రూపమున లోకప్రఖ్యాత
మొనరించినవారును, పరోపకార పరాయణు
లును, కృష్ణాఫార్మసీ ప్రొప్రయిటరులును,
ఆయుర్వేదభూషణ భిషగ్వర మొదలగు
బిరుదములతో కూడికొన్నవారును

అగు

## డాక్టర్. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు,

బెజవాడ



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IPWA10IB125 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 24-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |